# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక


## విషయానుక్రమణిక

**8 ఫిబ్రవరి 1950**





భారత రిపబ్లిక్ పార్లమెంటు ప్రథమసమావేశానికి హాజరైన అధ్యక్షుడు రాజేంద్రప్రసాద్ స్పీకర్ మావలంకర్ గారలు భవనంనుంచి వెలుపలికి వస్తున్నప్పటి చిత్రం.

# ఆంధ్రపత్రిక

సంవత్సర చందా
రు. 12-0-0
విడిపత్రిక
అణాలు 0-4-0

ప్రతిబుధవారము ప్రకటింపబడును.

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథముల కెల్లన్.
(మహాభారతము)

**Founder : K. NAGESWARA RAO.**

సంపుటము **42**
సంచిక **23**

విరోధి సంవత్సర మాఘ బహుళ షష్ఠి బుధవారము




భారతప్రభుత్వ డిస్ట్రాయరు 'స్లొటిల్లా' జనవరి 19 న ఏడెన్ దాపున మునిగిపోతున్న ఒక పడవలోని 9 మంది అరబులను రక్షించింది. రక్షితులు 23 న బొంబాయి చేరినప్పటి దృశ్యం.

# ఆంధ్రదేశంలో రిపబ్లిక్ దినోత్సవాలు



కొల్లూరులో ప్రతిజ్ఞాపత్రిక ఊరేగించారు.



తాడేపల్లిగూడెంలో ఊరేగింపుదృశ్యాలు



చింతలపూడిలో సభాదృశ్యం



ఏలూరు హైస్కూలులో పతాకావిష్కరణ



గుంటూరు జిల్లాబోర్డు భవనంపై ఉపాధ్యక్షుడు మారెడ్డి నరసారెడ్డిగారు పతాకవందనం జరిపారు.



ఆంధ్రపత్రిక

1950-వ సం॥ ఫిబ్రవరినెల 8-వ తేది బుధవారము

# నెహ్రూ సమర్థన

అధ్యక్షుని ప్రసంగముపై సభ్యులు చేసిన విమర్శలు ఏధోరణిలో నున్నవో ఆ విమర్శకులకు ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ ఇచ్చిన సమాధానము అదే ధోరణిలో నున్నది. పార్లమెంటుఅధ్యక్షుని ప్రసంగముపై జరిపిన రెండున్నర రోజుల చర్చఫలితముగ రిపబ్లిక్ ప్రభుత్వవిధానము ఏమంత విస్పష్టము కాలేదు. సభ్యులు, ప్రధానమంత్రి కూడ కేవలము ఉద్రేకములకు దాసులై వాస్తవిక దృక్పథమునకు స్వస్తి చెప్పిరని వారి ప్రసంగములను పరిశీలించిన వ్యక్తమగును. ప్రధానమంత్రి ఈ విషయమును గ్రహించినందుననే అధ్యక్షుని ప్రసంగముపై జరిగిన చర్చ, ఈ నూత్నసంప్రదాయము లక్ష్యమును సాధింపలేదని ప్రకటించుట జరిగినది.

సంప్రదాయము క్రొత్తదే కావచ్చును, కాని అధ్యక్షుని ప్రసంగము క్రొత్తవిధానమును వివరించియుండలేదు. జనవరి 26 వరకు కేంద్రప్రభుత్వ విధానము ఎట్లుండెనో, ఆ తరువాత కూడ అదేవిధముగ నున్నందున పార్లమెంట్ సభ్యుల ఉపన్యాసములు "పాతపాట" వలెనే యున్నవి.

పార్లమెంట్ రెండవరోజుచర్చలో పాల్గొన్న సర్దార్ వల్లభాయ్‌పటేల్ ప్రస్తుతావసరములకు తగ్గట్టుగ ప్రభుత్వవిధానము మార్పు చెందవలసియున్నదని విస్పష్టముచేసిరి. ఆ మార్పు ఏరీతిగ జరుగవలెనో సూచింపవలసిన బాధ్యత చాలవరకు ప్రజాప్రతినిధులపై గలదు. నేడు పార్లమెంటులో సభ్యులుగ నున్నవారు ఆ బాధ్యతలను నిర్వహించిన, పండిట్ నెహ్రూ ఆ దినము అంత ఉద్రేకపూరితమైన ఉపన్యాసమును చేసియుండెడివారుగాదు. ఉద్రేకప్రదర్శనకు అవసరముగాని, అవకాశముగాని యుండెడిదిగాదు.

ప్రధానమంత్రి తమ సమాధానమున భారత - పాకిస్తాన్ సంబంధములకు, కామన్వెల్తులో భారతదేశ సభ్యత్వమునకు ఎక్కువ ప్రాధాన్య మిచ్చిరి. కామన్వెల్తుసభ్యత్వము రిపబ్లిక్ ప్రభుత్వస్వాతంత్ర్యమును ఏమాత్రము పరిమితము చేయదని కొలంబోసమావేశము ధృవపరచినది. ఆ విషయమును పండిట్ నెహ్రూ తిరిగి తిరిగి ఉద్ఘాటింప నవసరము లేదు. అది కేవలము ఐచ్ఛికసంబంధమే యగుటవలన, రిపబ్లిక్ ప్రభుత్వము ఏక్షణములోనైనను ఆ సభ్యత్వమును వదులుకొనవచ్చును.

విదేశాంగవిధానమునకు సంబంధించినంతవరకు భారతీయులను ఎక్కువగ ఆందోళనపెట్టుచున్నది భారత-పాకిస్తాన్ వ్యవహారములే. పాకిస్తాన్ "దుష్ప్రవర్తన"కు తగిన విధానమును భారతప్రభుత్వము అనుసరించుటలేదని పార్లమెంటుసభ్యులు పలువురు విమర్శించియుండిరి. ప్రధానమంత్రి తమ విధానమును సమర్థించుకొనుచు అకారణముగ హిందూమహాసభపై దుమ్మెత్తిపోసెను. మతాధార రాజకీయపక్షముల నిరసింపవలసినదే. కాని రాష్ట్రప్రభుత్వములు కులాధారవిధానమును అనుసరించుచున్నంతకాలము, కేంద్రప్రభుత్వము ఆ విధానమును రద్దుచేయింపలేనంతకాలము మతాధార రాజకీయపక్షములను ఖండించుటకు తగ్గ అర్హత యుండదు, అర్హత లేక ఖండించినను, ప్రయోజనము ఉండదు. నేడు భారతదేశమున ఒక్క హిందూమహాసభేగాదు మతాధార రాజకీయపక్షము, ఇప్పటికిని 'ముస్లింలీగు' ఒకటి వ్యవహరించుచునేయున్నది. కులములపై ఆధారపడి అధికారమును సంపాదించి కోల్పోయిన "దక్షిణఇండియా లిబరల్ ఫెడరేషన్" తిరిగి అవతరింపనున్నది. వీటినన్నింటిని సహించిన భారతప్రభుత్వము ఒక్క హిందూమహా

సభపై తీవ్రవైఖరిని అవలంబించుట విపరీతముగ నున్నది.

పాకిస్తాన్‌తో యుద్ధమునకు దిగవలెనని ఎవ్వరు వాంఛించుటలేదు. పాకిస్తాన్ - భారతదేశవ్యవహారములు శాంతిమార్గమున, సాత్వికపద్ధతులపై పరిష్కారము కావలె ననియే అందరి అభిమతము. కాని అడుగడుగున పాకిస్తాన్‌ను తృప్తిపరచుటకు భారత ప్రభుత్వము చేయుచున్న ప్రయత్నములే ప్రజల అసంతృప్తికి కారణ మగుచున్నవి. కనుకనే హిందూ మహాసభ తిరిగి రాజకీయములందు ప్రవేశించుట సంభవించినది. పాకిస్తాన్‌విషయమున భారతప్రభుత్వము పరిస్థితులకు తగినట్టి విధానమును అనుసరించిన హిందూ మహాసభవలన ఎట్టి ప్రమాదము ఏర్పడదు.

ఇక ఆర్థికవిషయములగురించి ప్రధానమంత్రి వెల్లడించిన భావములు అంతకు ముందురోజు ఉపప్రధానమంత్రి ప్రకటించిన అభిప్రాయములనే బలపరచుచున్నవి. పండిట్ నెహ్రూ కంట్రోల్సును సమర్థించుచు రెండు సంవత్సరములక్రితము కంట్రోల్సును యెత్తివేయుట గొప్ప తప్పిదమైనదని ప్రకటించిరి. నాడా పొరపాటు జరిగియుండకపోయిన ఈసరికి పరిస్థితులు చక్కబడియుండెడి వని ప్రధానమంత్రి భావించుచున్నారు.

అవసరములకు తగినంత వస్తూత్పత్తి లేనపుడు, ధరలను అదుపునం దుంచుట, ఉత్పత్తియైన సరుకును ప్రజల అవసరములను గమనించి పంపకము చేయుట అవసరమే. కాని ధరల, పంపకముల కంట్రోలు సామాన్యప్రజలకు ఉపయోగకరముగ నుండునట్లు అమలు జరుపకున్న అట్టి కంట్రోల్సువలన యెట్టి ప్రయోజనము ఉండదు. ప్రభుత్వవ్యవహారములను నిర్వహించువారు ఎక్కువ వాస్తవికదృష్టితో ప్రవర్తింపకున్న నేటి పరిస్థితులు చక్కబడి భారతరిపబ్లిక్ బలపడుటకు ఏమాత్రము అవకాశము ఉండదు.



మనరాష్ట్రం, మనదేశం:

# ★ ప్రథమ రిపబ్లిక్ పార్లమెంటుసమావేశం భారతదేశంపట్ల పాకిస్తాన్ వైఖరి ★

భారతరిపబ్లిక్ మొట్టమొదటి పార్లమెంటు మొదటి సమావేశం జనవరి 31 వ తేదీ మంగళవారంనాడు ప్రారంభమయింది. దేశీయస్వాతంత్ర్య ప్రతిపత్తికి తగిన రీతిని పార్లమెంటు వ్యవహారవిధానం సంస్కరించబడింది. ఇకనుంచి ప్రతి సంవత్సరం మొదటి సమావేశంలో అధ్యక్షుడు పార్లమెంటుకు ప్రభుత్వవిధానాన్ని గురించి తెలుపుతారు. దానిపైన పార్లమెంటు చర్చ జరుపుతుంది. ఆ తరవాత బడ్జెట్ ప్రవేశపెట్టబడుతుంది. ప్రతి సమావేశంఆరంభంలోనూ అధ్యక్షుడు శాసనసభా కార్యక్రమవివరాల్ని గురించి తెలుపుతారు.

ఈ కొత్తపద్ధతిప్రకారం, పార్లమెంటు మంగళవారంసమావేశంలో ప్రభుత్వఆశయాల్ని గురించీ, విధానాన్ని గురించీ భారత రిపబ్లిక్ అధ్యక్షుడు రాజేంద్ర ప్రసాద్ సందేశమిచ్చారు. గత మూడు సంవత్సరాల కాంగ్రెస్ ప్రభుత్వకార్యకలాపాల్ని సమీక్ష చేశారు. ప్రస్తుత సమావేశంలో నడపవలసి ఉన్న శాసనాలను గురించి తెలియపరచారు.

భారతరిపబ్లిక్ ప్రభుత్వానికి శత్రువులెవరూ లేరనీ, ప్రపంచదేశాలన్నిటిలోనూ స్నేహం, శాంతి సాధించడమే ప్రభుత్వం ఆశయమనీ అధ్యక్షుడు డా. రాజేంద్ర ప్రసాద్ ప్రకటించారు. భారతప్రభుత్వం శాంతినే కోరుతున్నట్లు నిరూపించడానికిగాను ఈ సంవత్సరం దేశరక్షణకయ్యే ఖర్చుని తగ్గించడానికి నిశ్చయించిందన్నారు. అయితే దేశాన్ని దురాక్రమణనుంచి కాపాడ్డానికి ఏర్పాట్లలో లోపం లేకుండా జాగ్రత్తపడతారు.

గడచిన మూడేళ్లుగా దేశంలో ఆర్థికపరిస్థితి క్లిష్టంగానే ఉందనీ, ప్రభుత్వం ఈ సమస్యల్ని పరిష్కరించడానికి శక్తికొద్దీ కృషిచేస్తూనే ఉందనీ అధ్యక్షుడు అన్నారు. ఆర్థికాభివృద్ధినిమిత్తం ఒక ఆర్థికాభివృద్ధి సంస్థను నిర్మించడానికీ, విషయసేకరణకు కూడా ఒకసంస్థను స్థాపించడానికి ప్రభుత్వం నిశ్చయించింది.

ఇంతవరకూ భారతప్రభుత్వం సాధించిన కార్యాల్ని సమీక్షచేస్తూ సంస్థానాల ఏకీకరణగురించి అధ్యక్షుడు చెప్పారు. రైల్వే రవాణా చాలవరకు బాగుపడింది. ఆహారోత్పత్తి వృద్ధికార్యక్రమంలో కొంతవరకూ ఫలితం కలిగింది.

పాకిస్తాన్‌తో వ్యవహారాల్ని గురించి సమీక్షచేస్తూ, ఏసమస్యల్ని పరిష్కరించడానికిగాని యుద్ధానికి దిగరని ఉభయప్రభుత్వాలు బహిరంగప్రకటన చెయ్యాలనే సూచనను, పాకిస్తాన్ సహృదయంతో స్వీకరించగలదనే ఆశ ప్రకటించారు. కాశ్మీరంలో సక్రమంగా జనవాక్యనిర్ధారణ జరగడానికి తగిన శాంతిపరిస్థితు లేర్పడేవరకూ భారతప్రభుత్వం ప్రస్తుతవిధానాన్నే అనుసరిస్తుంది. కాశ్మీర్ సమస్య పరిష్కారమయ్యేవరకూ ఆ దేశసంరక్షణబాధ్యతను భారత ప్రభుత్వం ఎప్పటిమాదిరిగానే నిర్వహిస్తుంది. విదేశాంగవ్యవహారాల్లో ప్రభుత్వవిధానం ప్రపంచంలో భారతదేశానికి ఆదరగౌరవాలు ఆర్జించిపెట్టింది. ప్రపంచరాజ్యకూటాల వైషమ్యాలతో భారతప్రభుత్వం జోక్యంచేసుకోదు. అన్నిదేశాలతోనూ స్నేహసహకారాలకోసమే ప్రభుత్వం కృషి చేస్తుంది. బ్రిటిష్ కామన్వెల్తుదేశాలతో భారతదేశ బాంధవ్యం భారతదేశానికి ప్రయోజనకారి కాగలదు.

భారతప్రభుత్వపరిపాలనావిధానవివరణపై పార్లమెంటులో బుధవారం గురువారం చర్చ జరిగింది. సభ్యుల విమర్శలకు గురువారంనాడు సర్దార్ పటేల్, శుక్రవారంనాడు పండిట్ నెహ్రూ సమాధానాలిచ్చారు. అనంతరం అధ్యక్షుని సందేశాన్ని పార్లమెంటు ఆమోదించింది.

ఆహారసమస్య, పాకిస్తాన్‌తో వ్యవహారాలపైనే పార్లమెంటులో తీవ్రవిమర్శ వచ్చింది. కొందరు కార్మికవ్యవహారాల్లో ప్రభుత్వవిధానాన్ని విమర్శించారు. పాకిస్తాన్‌తో వ్యవహారాల్లో భారత ప్రభుత్వం మరీ మెత్తగా ఉందని కొందరు సభ్యులు విమర్శిస్తూ, దేశరక్షణాశాఖకోసం ఖర్చు తగ్గించరాదని సూచించారు. పాకిస్తాన్ యుద్ధానికి గట్టిసన్నాహాలు చేస్తున్నప్పుడు భారతప్రభుత్వం ఏపాటి జాప్యంలేకుండా దురాక్రమణనుంచి దేశాన్ని రక్షించడానికి సిద్ధపడాలని సూచించారు. భారతప్రభుత్వం మెత్తదనంవల్లనే పాకిస్తాన్ ప్రభుత్వం పాకిస్తాన్‌లోని హిందువులపైన దౌర్జన్యాలు జరుపుతున్నదని కొందరు విమర్శించారు. కార్మికవ్యవహారాల్లో భారతప్రభుత్వం కార్మికులకు న్యాయం చేకూర్చడంలేదనీ ధనికవర్గాలనే అధికంగా ఆదరిస్తున్నదనీ భారతజాతీయ కార్మిక కాంగ్రెస్ నాయకుడు ఖండూభాయ్ దేశాయ్ విమర్శించారు. కార్మికులకు న్యాయమైన వేతనా లిప్పించడానికీ, లాభార్జనలో కార్మికులకు కూడా కొంతవంతు ఇప్పించడానికి శాసనాలద్వారా కృషి చెయ్యడానికీ, కార్మికులకు వసతి సౌకర్యాలు వృద్ధిచెయ్యడానికీ ప్రభుత్వం చేసిన వాగ్దానాల్ని నిలబెట్టుకోలేదని విమర్శించారు. ఆహారసమస్యాపరిష్కారం విషయంలో భారతప్రభుత్వం అనుసరిస్తున్న విధానం బొత్తిగా అసంతృప్తికరంగా ఉందనీ, 1951 సంవత్సరాంతానికి భారత దేశం ఆహారంలో స్వయంసమృద్ధం కావడం అసంభవమనీ ఫ్రాంక్ ఆంథొనీ విమర్శించారు.

చర్చలకు [illegible] సమాధాన మిచ్చిన

సర్దార్ పటేల్, భారతప్రభుత్వ కార్మిక విధానాన్ని సమర్థించారు. కార్మికుల క్షేమానికీ సౌకర్యాల అభివృద్ధికీ ప్రభుత్వం చేసిన కార్యాల్ని వివరించారు. ఇంకా ప్రభుత్వం తలపెట్టనున్న శాసనాల్ని తెలిపి, ప్రభుత్వం ధనికవర్గాలపట్ల పక్షపాతం వహించిందనే వాదం అసంగతమని చెప్పారు. ప్రభుత్వ విధానాన్ని ధనికవర్గాలవారూ, కార్మికవర్గాలవారూ, మధ్యతరగతివారూ కూడా విమర్శిస్తూనే ఉన్నారు. కాని వాస్తవానికి ప్రభుత్వం ఎవరిపట్లనూ పక్షపాతం వహించలేదనీ, అన్ని వర్గాలవారికీ న్యాయం చేకూర్చడమే ప్రభుత్వలక్ష్యమనీ సర్దార్ పటేల్ చెప్పారు. అయితే ప్రజల సహకారం ఉంటేనే ప్రభుత్వకార్యక్రమాలు ఫలవంతం కాగలవు. పరస్పరదూషణలతో నిమిత్తం లేకుండా కార్మికులు కృషి చెయ్యాలనీ, ధనికవర్గాలు దేశీయసంపదను వృద్ధి పరచాలనీ పటేల్ చెప్పారు. కార్మికవర్గాల్ని రెచ్చగొట్టడంలో సోషలిస్టులు అవలంబిస్తున్న అనుచితవిధానాల్ని సర్దార్ పటేల్ విమర్శించారు. సంస్థానాల ఏకీకరణ, సమీప రాష్ట్రాల్లో విలీనంచేసిన విధానాన్నీ, కేంద్ర ప్రభుత్వ పాలితప్రాంతాల్లో ప్రభుత్వవిధానాన్నీ విమర్శించినవారికి కూడా సమాధానమిచ్చారు.

శుక్రవారంనాడు పండిట్ నెహ్రూ చర్చకు సమాధానమిస్తూ పార్లమెంటుచర్చ తృప్తికరంగా లేదని చెప్పారు. విదేశ, ఆంతరంగిక, వాణిజ్య, ఆర్థిక, కార్మిక వ్యవహారాల్లో భారతప్రభుత్వం అనుసరించే విధానాలనూ, లోపాలనూ విమర్శించడానికి ఏర్పాటైన ఈ సమావేశంలో, సభ్యులు ప్రధాన విషయాల్ని విడిచిపెట్టి అల్ప విషయాల్ని చర్చించడం తమకు ఆశాభంగం కలిగించిందన్నారు. ఈ అల్పవిషయాల్ని చర్చించవలసినది బడ్జెట్‌చర్చలో కాని ఇప్పుడు కాదని చెప్పారు.

తరువాత సభ్యుల విమర్శలకు సమాధానమిస్తూ దేశీయసమస్యల పరిష్కారానికి అన్ని వర్గాలవారిలోనూ సమాజకర్తవ్య దృక్పథం ఒకటి అలవడాలనీ, అది ముఖ్యంగా పెట్టుబడిదారులు, ధనవంతులు, వర్తకుల్లో లోపించినట్లు కనపడుతున్నదనీ చెప్పారు.

పాకిస్తాన్‌తో వ్యవహారాలపై విమర్శలకు సమాధానమిస్తూ, పాకిస్తాన్ ప్రదర్శిస్తున్న క్షుద్రమనస్కతను భారతప్రభుత్వం అనుకరించడం అసంభవమని చెప్పారు. అయితే దేశరక్షణకు ఎప్పుడూ సంసిద్ధంగానే ఉంటారు. నిత్యమూ ఇరుగునా పొరుగునా గడపవలసిన దేశాలమధ్య వైషమ్యాలు పెరగడం మంచిది కాదు. ఈ సమస్యలు, కక్షలు ఆట్టేకాలం ఉండేవి కావు. ఎప్పటికైనా స్నేహసహకారాలు సాధించవలసినదే. అందువల్ల ప్రస్తుతసమస్యల్ని పరిష్కరించడానికి సౌజన్యం, సహృదయతలతో ప్రవర్తించవలసి ఉంది. కాని దురాక్రమణ సంభవిస్తే రక్షించుకోడానికి చాలినంతబలం ఆర్జించుకోగలరు. ఈవిషయంలో భారతప్రభుత్వం అశ్రద్ధ వహించదు. ఈ సందర్భంలో మతంపేరుతో ద్వేషాలు రెచ్చగొడుతున్న హిందూమహాసభ మొదలైన సంస్థల్ని పండిట్ నెహ్రూ తీవ్రంగా విమర్శించారు. ఒకవంక రక్షణకు తగిన బలం చేకూర్చుకుని, అన్యాయానికీ అక్రమానికీ తావివ్వకుండా జాగ్రత్తవహిస్తూ, మరొకవంక స్నేహసౌహార్ద్రాలతో ప్రవర్తించడం భారతప్రభుత్వలక్ష్యమని పండిట్ నెహ్రూ అన్నారు. తూర్పుబెంగాల్‌నుంచి మళ్లీ హిందువులు అనేకులు పశ్చిమబెంగాల్‌కు వలసవస్తున్నారు. ఈ సందర్భంలో అందరూ జాగ్రత్తగా ఉండాలనీ, ఎవ రేపొరపాటు చేసినా, ఎవరు మితిమీరినా తిరిగి దేశం కల్లోలంలో పడిపోయే ప్రమాదం ఉందనీ, అందువల్ల ఎవరూ ఆవేశాలకు లోనుకాకూడదనీ పండిట్ నెహ్రూ హెచ్చరించారు.

భారతరిపబ్లిక్ ఇంకా కామన్వెల్తులోనే ఉంటే అది అందరికీ లాభదాయకమని పండిట్ నెహ్రూ అన్నారు. ఈ సభ్యత్వంవల్ల భారతదేశస్వాతంత్ర్యానికి రవంతైనా భంగం ఉండదన్నారు.

ఆహారసమస్యపై విమర్శలకు సమాధానమిస్తూ, ఆహారోత్పత్తివృద్ధికార్యక్రమం చురుగ్గానే సాగుతున్నదని చెప్పారు. 1949 లోకంటె 1950 లో విదేశాలనుంచి ఆహారవస్తువుల దిగుమతి దాదాపు సగం తగ్గించబడుతున్నదని తెలిపారు. 1951 లో ఇంకా తగ్గించబడుతుంది. దీన్నిబట్టే ఆహారంలో దేశాన్ని స్వయంసమృద్ధిచేసే కార్యక్రమం ఫలిస్తున్నట్లు బోధపడుతున్నదన్నారు.

కొందరు ఆహారవస్తువులపై కంట్రోల్సు తొలగించాలని చేసిన సూచనను నిరాకరిస్తూ, గతానుభవాన్ని బట్టి ఆహారంధరలతో గాని కంట్రోల్సులతో గాని చెలగాటం ప్రమాదకరమని చెప్పారు. ప్రజల్లో సర్వవర్గాలవారి సహకారంతో రిపబ్లిక్ సర్వబలసంపన్నం కాగలదని పండిట్ నెహ్రూ ఆశాభావం ప్రకటించారు.

## పాకిస్తాన్ వైఖరి:

పాకిస్తాన్‌లో నానాటికీ భారతదేశంపట్ల విషప్రచారం అధికమౌతోంది. కాశ్మీరసమస్యలోనూ, ఆర్థికసమస్యలోనూ భారతదేశాన్ని జయించలేకపోయినకారణంగా పాకిస్తాన్ ఏవిధానైనా భారతదేశాన్ని సాధించాలని నడుం కట్టింది. కనీసం ఆర్థికంగానైనా ఉభయప్రభుత్వాలు పరస్పర స్నేహసహకారాలతో వర్తించక తప్పదనే భావం ప్రపంచంలో ప్రబలిఉన్నందువల్ల అది సత్యంకాదని నిరూపించాలనే తాపత్రయమే ముఖ్యంగా పాకిస్తాన్ నాయకుల్లో కనిపిస్తోంది.

భరతఖండాన్ని (భారత రిపబ్లిక్, పాకిస్తాన్‌లు) ఆర్థికంగా ఏకఖండంగా భావించవలసిఉంటుందనీ, భరతఖండంలో శాంతిని స్థాపించాలంటే ఉభయ ప్రభుత్వాలూ కక్షలు మానితీరాలనీ బ్రిటన్ అమెరికాలు పదేపదే చెప్తున్నాయి. అయితే ఈ కక్షలు కొనసాగడానికి నింద చాలావరకు భారతప్రభుత్వంపైనే మోపుతూ బ్రిటన్ అమెరికాలలోనూ, ఇతర దేశాలలోనూ ప్రచారం జరుగుతోంది. వాస్తవపరిస్థితి ఆ దేశాల నాయకులకు తెలియక కాదు.

ఎక్కడ ఏ రెండుదేశాలమధ్య సంఘర్షణ వచ్చినా బలహీనమైన దేశానికి మద్దతిచ్చి, ఏ దేశమూ బలవత్తరం కాకుండా నిరోధించడమే యూరోపియన్ వర్గాల విధానం. ఈ విధానం ఈనాటిది కాదు. అనేకశతాబ్దాలుగా యూరోపియన్ల రాజకీయాలీ రీతిగా ఉన్నాయి. పాకిస్తాన్ నాయకులు మతోన్మాదంలో ఈ విషయాన్ని గుర్తించకపోవడంవల్లనే ఇన్ని సమస్యలొస్తున్నాయి. అందువల్లనే ఎప్పటికైనా పాకిస్తాన్ నాయకులు తమ స్థితిని గ్రహించగలిగినట్లయితే, భారతరిపబ్లిక్‌తో స్నేహం చేసుకోడానికి అప్పటికే ఆటంకాలూ లేకుండా, ఇప్పటినుంచీ పాకిస్తాన్ విరోధభావాన్ని లక్ష్యపెట్టకుండా భారతీయులు సహనంతో స్నేహమే పాటించాలని పండిట్ నెహ్రూ ఆశిస్తున్నారు.

కాని ఇప్పట్లో పాకిస్తాన్ విరోధం మానే సూచనలు కనిపించడం లేదు. రోజురోజుకీ ద్వేషం పెరుగుతోంది. కాశ్మీర్ సమస్య విషయంలో కెనేడియన్ ప్రతినిధి మెక్నాటన్ ప్రతిపాదనల్ని భారత ప్రభుత్వం నిరాకరించింది. భద్రతామండలి కాశ్మీర్ సమస్యను పరిష్కరించి పాకిస్తాన్‌కు (కాశ్మీర్ దేశానికి కాదు) న్యాయం చేకూర్చితేనే గాని (అనగా నయానోభయానో భారతరిపబ్లిక్‌ను లొంగదీసి కాశ్మీరాన్ని పాకిస్తాన్‌కు ఒప్పగిస్తేగాని అని వారి ఆంతర్యం కాబోలు) పాకిస్తాన్ యుద్ధం చేసైనా కాశ్మీరాన్ని వశపరుచుకోగలదని పాకిస్తాన్ నాయకులు ప్రచారం చేస్తున్నారు. పాకిస్తాన్ ప్రజల్లో భారతరిపబ్లిక్ పట్ల విద్వేషం రెచ్చగొడుతున్నారు. పెద్దసైనికబలాన్ని నిర్మిస్తున్నారు. కెనడా మొదలైన దేశాల నుంచి విరివిగా ఆయుధసామగ్రిని దిగుమతి చేస్తున్నారు. పాకిస్తాన్ ప్రభుత్వ వ్యయంలో నాలుగింట మూడువంతులు యుద్ధసన్నాహాలకీ దేశరక్షణకీ ప్రత్యేకించబడింది. ఏదో అదును చూసుకుని కాశ్మీరంపైనా అవసరమైతే భారతదేశంపైనా దాడి చెయ్యడానికి పాకిస్తాన్ సర్వసన్నాహాలు చేస్తోంది. భారతప్రభుత్వంకూడా దాడుల నుంచి దేశాన్ని రక్షించడానికి సిద్ధంగానే ఉంది. అయితే దేశరక్షణకోసం ఇప్పుడేమీ అదనంగా ఖర్చు చెయ్యవలసిన అవసరం లేదు.

కాని ఈ సన్నాహాల ఫలితాన్ని ఇప్పుడే తూర్పుబెంగాల్లో హిందువు లనుభవించవలసివస్తోంది. దుష్ప్రచారానికి లోనైన తూర్పుపాకిస్తాన్ ప్రజలు అల్పసంఖ్యాకులు, నిరాయుధులుఅయిన హిందువులపైన కక్ష సాధిస్తున్నారు. మళ్లీ తూర్పుబెంగాల్ నుంచి పశ్చిమబెంగాల్‌కు వేలాదిగా హిందువులు పరారీఅవుతున్నారు. ఏదోవిధంగా భారతప్రభుత్వాన్ని రెచ్చగొట్టి యుద్ధం ప్రారంభించి నిందనంతటినీ భారతరిపబ్లిక్‌పైన మోపాలని పాకిస్తాన్ ప్రయత్నం. కాని ఎంత రెచ్చగొట్టినా పశ్చిమబెంగాల్లో హిందువులు ఆవేశపరులు కారాదని పండిట్ నెహ్రూ హెచ్చరించారు. తూర్పుబెంగాల్లో హిందువుల దుస్థితినిగురించి తమ నిరసనను భారతరిపబ్లిక్ పాకిస్తాన్‌కు తెలియపరిచింది. కాని పాకిస్తాన్ ప్రభుత్వం సమాధానం ఇవ్వలేదు.

తూర్పు బెంగాల్ ప్రభుత్వం మాత్రం ఒక పత్రికా ప్రకటన చేసింది. పశ్చిమబెంగాల్లోనూ ముఖ్యంగా కలకత్తానగరంలోనూ మతకలహాలు సంభవించినాయనీ, అక్కడనుంచి తమ దేశానికి మహమ్మదీయులు పారిపోయివస్తున్నారనీ, అందువల్లనే తూర్పుబెంగాల్లో తిరిగి మతకలహాలు సంభవిస్తున్నాయనీ, అందులో ప్రకటించారు. తూర్పుబెంగాల్ నుంచి 80 వేలమంది హిందువులు పారిపోయివచ్చినమాటను తూర్పుబెంగాల్ ప్రభుత్వం నిరాకరించలేదు. కాని మహమ్మదీయులు పశ్చిమబెంగాల్ నుంచి పారిపోయినమాట అబద్ధమని ముఖ్యమంత్రి డా॥ బి. సి. రాయ్ ప్రకటించారు.

తూర్పుబెంగాల్లో హిందువులపై జరుగుతున్న అత్యాచారాల ఫలితంగా పశ్చిమబెంగాల్లో మహమ్మదీయులకు అపకారం కలిగే ప్రమాద మున్నదనీ, తూర్పుపాకిస్తాన్ ప్రభుత్వం వెంటనే హిందువులపై జరుగుతున్న అత్యాచారాల్ని అరికట్టాలనీ విన్నవిస్తూ పశ్చిమబెంగాల్‌లోని ముస్లిం నాయకులు కొందరు ప్రకటన చేశారు. కాని ఈ హేతువాదం పాకిస్తా- నాయకులు చెవిని పెట్టడంలేదు. వారు కోరేది కల్లో మే ననే విషయం మరొకసారి స్పష్టపడుతోంది.

## దక్షిణాఫ్రికాతో లాలూచీ :

ఆర్థికరంగంలో భారతరిపబ్లిక్‌తో కక్ష సాధించడానికి సమకట్టి పాకిస్తాన్ తాను చిక్కుల్లో పడిపోయింది. భారతదేశానికి రావలసిన నారను బిగబట్టేఉంచింది. తన ఇష్టం వచ్చిన ధరకు నారను భారతీయులు కొనాలని పట్టుబట్టింది. శరణార్థులై భారతదేశం పారిపోయివచ్చినవారి ఆస్తుల్ని అక్రమంగా అన్యాక్రమణ చేసింది. యజమానులకు పైసా చెల్లించలేదు. ఇంకా అక్కడున్న హిందువుల్ని కష్టాలపాలుచేసి వారి ఆస్తుల్ని స్వాధీనపరుచుకోవడం ఆరంభించింది. భారతదేశద్రవ్యం కొనే విషయంలోనూ, భారతదేశానికి పాకిస్తాన్ ద్రవ్యాన్ని అమ్మే విషయంలోనూ బాంకులపై అనుచితమైన నిర్బంధాలు విధించింది. భారత ప్రభుత్వం అన్నిటినీ సహించింది. కాని డబ్బు చెల్లించికొన్న నారను భారతదేశానికి రాకుండా జప్తు చెయ్యడంతో భారతప్రభుత్వం ప్రతీకారం చెయ్యక తప్పిందికాదు.

పాకిస్తాన్‌కు బొగ్గురవాణా నిలిపివేసింది. ఈ ఒక్క చర్యకే పాకిస్తాన్ తట్టుకోలేకపోయింది. బొగ్గు తెచ్చుకోడానికి పోలండ్ బ్రిటన్ మొదలైన దేశాలతో రాయబారాలు జరిపింది. కాని వారి ధరలు తలకు మించి ఉన్నాయి. రహస్యంగా భారతప్రభుత్వముతో రాయబారాలు మొదలెట్టింది.

కాని రావలసిన నార పంపించేవరకూ బొగ్గురవాణాకు అంగీకరించబోవడంలేదని భారతప్రభుత్వం ఖండితంగా తెలియచేసింది. నాలుగులక్షలబేళ్లు నార రావలసిఉండగా 40 వేల మణుగుల నారను ఇంతవరకూ పంపినట్లు పాకిస్తాన్ ప్రభుత్వం ప్రకటించింది. కాని చేరిన నార బహుస్వల్పమని భారత ప్రభుత్వం చెప్పింది. ఇంకా చాటుగా రాయబారాలు సాగుతున్నాయి.

ఈలోగా భారతప్రభుత్వంతో ఆర్థికరంగంలో ప్రచ్ఛన్నయుద్ధం సాగించడానికిగాను పాకిస్తాన్‌కు అపూర్వమైన అవకాశం లభించింది. భారతీయులందర్నీ (పాకిస్తానీలని కూడా) అస్పృశ్యులకంటె నికృష్టంగా పరిగణిస్తున్న దక్షిణాఫ్రికాప్రభుత్వంతో లాలూచీకి దిగింది. దక్షిణాఫ్రికాలో జాతివైషమ్యాల్ని నివారింపచేసి భారతీయులకు గౌరవప్రపత్తులు లభింపచెయ్యడానికి ఐక్యరాజ్యసమితి ద్వారా భారతప్రభుత్వం మూడేళ్లుగా కృషిచేస్తోంది. దక్షిణాఫ్రికాప్రభుత్వానికి పరాభవం జరిగినా వారి విధానం మార్చుకోలేదు సరిగదా మరింత పట్టుదలతో భారతీయులపైనా, నీగ్రోలపైనా కక్ష సాధించ నారంభించారు. ఐక్యరాజ్యసమితి ఆదేశానుసారం దక్షిణాఫ్రికాలో భారతీయులసమస్యా పరిష్కారవిధానం ఆలోచించడానికి దక్షిణాఫ్రికాలో రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్ ఏర్పాటయింది. దక్షిణాఫ్రికాప్రభుత్వం కొంత లొంగివచ్చినట్లు కనిపించింది. కాని ఈలోగా దక్షిణాఫ్రికాప్రభుత్వంతో లాలూచీపడితే భారతప్రభుత్వాన్ని సాధించవచ్చునని పాకిస్తాన్ తలచింది. దక్షిణాఫ్రికాతో తెగతెంపులు చేసుకొన్న వాణిజ్యాది సంబంధబాంధవ్యాలను తిరిగి పాకిస్తాన్ ఉద్ధరించుకోడానికి నిశ్చయించింది. భారతప్రభుత్వం ఇందు కంగీకరించలేదు.

దీనివల్ల భారతదేశానికి అపారనష్టం సంభవించక తప్పదు. పాకిస్తాన్‌లో పడి మురిగిపోతున్న నారను వెంటనే దక్షి

ణాఫ్రికా కొనగలదు. దీనికి ప్రతిగా దక్షిణాఫ్రికా పాకిస్థాన్‌కు బొగ్గు సప్లై చెయ్యవచ్చును. కాని ధరలవిషయంలో ఉభయ ప్రభుత్వాలమధ్యకూ సమాధానం కుదరడం కష్టమైన విషయం. బొగ్గు ఎంతవరకూ సప్లై కాగలదో కూడా చూడవలసిన విషయమే. అయితే తన దేశస్థుల్నికూడా కుక్కలకంటె నీచంగా పరిగణిస్తున్న దక్షిణాఫ్రికాతో మైత్రి భారతదేశంతో మైత్రికంటె మేలని భావించే పాకిస్థాన్ దేనికీ సంకోచించకపోవచ్చును.

దీనివల్ల దక్షిణాఫ్రికాలో భారతీయుల సమస్యపరిష్కారం కాదు సరిగదా! మలాన్ ప్రభుత్వం మరింత కఠినచర్యలకి దిగడానికి కూడా అవకాశం లభిస్తుంది. ఇటు భారత రిపబ్లిక్ పాకిస్థాన్ల మధ్య ఆర్థికబంధాలు శాశ్వతంగా విచ్ఛిన్నమైపోయే ప్రమాదం కూడా ఉంది.

[సీతారాం]

---

# పశ్చిమ గోదావరిజిల్లా పశుప్రదర్శనం

ఈజనవరి మాసాంతంలో దెందులూరులో జరిగిన పశుప్రదర్శనంలో బహుమానం పొందిన పశువులు.







1. మొదటి బహుమానం పొందిన దేశీవాళీ ఎడ్లజత. కొడాలి అంజయ్యగారివి.

2. 3 ఏండ్ల లోపు దూడలలో మొదటి బహుమతి పొందిన ఆవు పెయ్య. కొమ్మారెడ్డి సత్యనారాయణ వరప్రసాదరావుగారిది.

3. మొదటి బహుమానం పొందిన గేదె. చిట్టిబొమ్మ వెంకటస్వామిగారిది.



# తల్లి

"అవనీంద్ర"



స్త్రీ హృదయంలో అనేక వింతకోర్కెలు కలుగుతూంటయ్. స్త్రీ 'భార్య' గా నున్నప్పుడు కలిగే కోరికలు వేరు. 'తల్లి'గా నున్నప్పుడు కలిగే కోర్కెలు వేరు. మధ్యలో కలిగే అనేకపరిణామాలవల్ల కూడా స్త్రీవృత్తి మారుతూఉన్నప్పటికీ కేవలం తల్లిగా కలిగే కోర్కెలు ఎప్పుడూ ఒకటే; ఆకాశం ఎప్పుడూ నిర్మలంగానే ఉంటుందికాని అప్పుడప్పుడు మేఘావృతమై, కల్లోలంగా ఉన్నట్లు కనిపిస్తుంది అంతే.

ఆ రోజున ఉమ ఇంట్లో ఒక్కతే ఉండిపోయింది. అంతకుపూర్వం అత్తగారు ఇంట్లో తనతోపాటు ఉన్నా తను విరామంగా తన దురవస్థనుగూర్చి, విచారించుకొని దుఃఖించే అవస్థ ఆరోజుకిగాని కుదరలేదు. వంటఇంట్లో తన భర్త శివరావుకి ఇష్టమైన కూరచేస్తూ, ఏదో ఆలోచిస్తూ, తన విధినిగూర్చి తిట్టుకొని, ఊరికే కళ్లనీళ్లు కార్చుతోంది. అంత చిన్నవయస్సులో నున్న తనకు అత్తగారి హృదయం తెలవలేదు. మొదట్లో తను కాపరానికి వచ్చిన రోజుల్లో తనను స్వంతకూతురులాగా చూస్తూవచ్చేటప్పటికీ, నిజంగా తను అదృష్టవంతురాలననుకుంది. తన రోజులు దివ్యంగా గడిచిపోతయ్యనుకుంది. "అత్తగారు తల్లి ఎట్లా అవుతుంది? అత్తగారు అత్తగారే. తల్లి తల్లే!" అది తేలిపోయింది. చేసేదేంలేక, కోడంటికమే తనకు వ్రాసిపెట్టి ఉందనుకొని ఊరికే కుమిలిపోయింది. "అత్తగారూ ఒకింటి కోడలేకదా!" అనే సందేహంమాత్రం ఆమెకు అప్పుడప్పుడు కలగకపోలేదు. అయితేమాత్రమేం? ఈ విధంగా ఆ చిన్నహృదయం దుఃఖంతో నిండిపోయింది. తెల్లవారకముందే లేవాలి. ఇంటిపాచిపనిఅంతా చెయ్యాలి. బట్టలుతకాలి. అంట్లు తోమాలి. మళ్లా మడికట్టుకోవాలి వంటతయారుచేయాలి వేళకి. అప్పుడు తింగరంగా అంటూ అత్తగారు మడికట్టుకోవచ్చి, "ఆ కూర అల్లా చేశావేం? దీంట్లో ఉప్పు ఎక్కువవేసి తగులెట్టావ్. దాంట్లో కారమే లేదు. ఛీ! ఛీ! వెధవవంట. చెయ్యమని ఎవ్వరేడ్చేరు!" అని ప్రతిదాంట్లోనూ తప్పులు ఏరి, ఘుంకీలుపెట్టి మాట్లాడకుండా కొడుకుకు పెట్టి; తను తిని బైటకు వెళ్ళిపోతుంది!!

మొదట్లో, క్రొత్తగా కాపరానికి వచ్చినప్పుడు అత్తగారు కామేశ్వరి ఉమమీద ప్రేమ కురిపించేది. ప్రేమే తనుగా పుట్టిందా అనే భ్రమ కలిగింది! కాని హఠాత్తుగా మారిపోయింది. ఇది ఉమ కర్థం కాలేదు. కాకపోగా చాలా బాధపడుతూవచ్చింది. "ఏం! నేనేం తప్పుచేస్తున్నాను. అన్నీ సరిగ్గా నేలపట్టుకి చేస్తున్నానే! ఏపనీ పాడుచేయటంలేదే! మరింకెందుకు నామీద అంత మంటలు!" శివరావుకు ఈవిషయం చెబుదామనుకున్నా చెప్పి లాభం లేదనుకుంది. ఎందుకంటే, శివరావు, తనమధ్య, అత్తగారిమధ్య పెరిగిపోతున్న ఈవైవిధ్యపు పట్టును గ్రహించాడా, కల్పించుకోకుండా ఊరుకుంటున్న సంగతి తనకు తెలుసు!

ఆవిధంగా మనస్సులో ఊహలని తలపోసుకుంటూ కూరతయారుచేసింది. వంటఇంట్లోకి ఎవరో వస్తున్నట్లు, పాదాల చప్పుడువల్ల గమనించింది. వెంటనే అవచ్చేది తనభర్తేనని గ్రహించింది. హృదయం ఆనందంతో ఉప్పొంగింది. ఒళ్లంతా గగుర్పొడిచింది. సూర్యునిముందు మంచువిధంగా తన దుఃఖం ఒక్కమాటు కరిగిమాయమైంది! వెంటనే తనకళ్లవెంటనున్న నీటిచుక్కల్ని, చెంగుతో తుడుచుకొని, పైటసర్దుకొని, నిలుచుంది. శివరావు రావటం, తన అత్త కామేశ్వరి గమనించినా, ఆవిడ మామూలుగానే ఏవిధమైన మనశ్చలనంలేకుండా అల్లా ఉండిపోయింది. శివరావు వంటఇంటి తలుపు తెరిచి, గడపమీద నిలబడి, సానురాగంగా భార్యనుచూచి చిరునవ్వునవ్వాడు. ఉమకూడా, వెంటనే తన భర్తయొక్క గాఢానురాగసూచనకు కృతజ్ఞతగా చిరునవ్వు సూచించిందో లేదో, కామేశ్వరి వెంటనే రానేవచ్చింది వంటఇంట్లోకి! ఆమెను చూడంగానే ఉమ ముఖం మళ్లా గ్రస్తమయింది. శివరావు ఇది గమనించకపోలేదు. దొడ్లోకివెళ్లి భోజనానికని కాళ్లూచేతులూ కడుక్కున్నాడు. కామేశ్వరి కొడుకుకు పీటవేస్తూ, "ఉమా ఇహ చాలుగాని నేను వాడికి వడ్డిస్తాను

నువ్వెళ్ళి, దొడ్లో, తడి పేసి పెట్టిన బట్టలు ఉతికి, పిండి ఆరవేయి...ఊc." అని హూంకరించింది.

ఉమ నావిధంగా ధిక్కరించి, కామేశ్వరి అన్నపుపళ్లెం అందుకుంది. ఉమకు కడుపులో మంటమండింది. తన అత్తగారి హుంకారాన్ని నిరాకరించుదామని అనుకుంది కాని ఆమెకు చేయలేనని కూడా తెలుసు. అక్కడే మాట్లాడకండా నిలుచున్న భర్తకు తన చూపుల ద్వారా విన్నవించుకొంది. చేతులు కడుక్కొని తడిని ధోవతిచెంగుతో తుడుచుకుంటున్న ఉమ శివరావు ప్రేమ దృక్కుల ద్వారా సాంత్వనంపొంది, నీళ్లగదిలోకి వెళ్లి పోయింది.

కాని ఉమకు దుఃఖం ఆగకపోయింది. పంపువద్గర నిలుచొని ఊరికే కళ్ళనీళ్లు కార్చింది. 'అత్తగారు నాయెడల ఇంత క్రూరంగా ఎందు కుండాలి? నాభర్తకు నేను ప్రేమమీర భోజనం పెట్టుకుందామనుకుంటే, తను ఎందుకు అడ్డురావాలి? నా భర్తకు నేను అన్నం పెట్టుకోటం తప్పా?" అని మనస్సులో వాపోయింది. పంపునీళ్లు తమకు కాదన్నట్లుగా, తొట్టిలో పొర్లి పోతున్నయ్. ఉమ అక్కడే చతికిలబడి మోకాళ్లలో తన ముఖాన్ని దాచుకొని ఎక్కి ఎక్కి ఏడ్చింది. ఆ ఏడ్పులు ఆమె శరీరాన్నే కదిలించేసినయ్! ఎప్పటికప్పుడు సరిక్రొత్తగా అత్తగారి ఈ సడింపులు హుంకారాలు తన స్మరణకువచ్చి తన హృదయాన్ని కలచివేస్తున్నయ్. "చచ్చి స్వర్గాన ఉన్న నా తల్లిని ఎప్పుడూ ఆడిపోసుకుంటుంది! గోవులాటి మనిషికదా నాతల్లి!"

కామేశ్వరి ఎప్పుడూ ఉమతల్లిని లెక్కలేనన్ని తిట్లు తిట్టేది. ఉమని ఇంటిపనుల్లో సరిగ్గా తరిఫీదు చెయ్యలేదని ఆడిపోసేది. అయినా ఉమకు తెలుసు. తన తల్లి ఎల్లా తనను పెంచిందో, ఎలా పెద్దదాన్ని చేసిందో! తను పోతూపోతూ, దూరపుబంధువైన కామేశ్వరి తన కొడుకును చేసుకుంటానని తనను స్వయంగా కోరితే ధన్యురాలనని, ఆమెచేతిలో పెట్టింది తనను. ఉమ శివరావును చూచింది. ప్రేమించింది. కామేశ్వరి ప్రేమనుకూడా చూరగొంది. ఇక తను ఆమెకోడలు అయితే, ఇక ఏవిధమైన కష్టాలుండవనీ అంతా సుఖం, స్వర్గతుల్యమనీ' గాలిమేడలు కట్టింది. ఆమెకు కామేశ్వరి మొదటిరోజులలో, స్వంతకూతురుమాదిరిగా తనను ప్రేమించిన ప్రతిసన్నివేశమూ కళ్లకు కట్టినట్లు గుర్తుకు వచ్చినవి. కాని అదంతా ఒక సుఖస్వప్నం మాదిరయింది. ఉమ నిజంగా ఉదారురాలు. సింధుహృదయం, కోపం ఆమెకు శత్రువు. అత్తగారు తనను అల్లా కోసి పెడుతున్నా పల్లెత్తుమాట అని ఎరుగదు - ఉమ కళ్ల నీళ్లు తుడుచుకొని బట్టలు ఉతికే పనిలో నిమగ్నురాలైంది.

ఈలోగా శివరావు నెమ్మదిగా భోజనం చేశాడు. అతనికి తెలుసు ఈ ఉభయుల వైవిధ్యము. కాని ఏం చేయటానికీ తోచలేదు. తనకే అర్థం కావటంలేదు - అంత ప్రేమగా ఉన్న తల్లి, తనభార్య.నావిధంగా ఇప్పుడు ఎందుకు కంటగిస్తోందో? "ఇంకా ఉమ చిన్నపిల్లేగదా! అందులో అతిసాధ్వి. అల్లాంటప్పుడు తను ఎల్లాచెపితే అల్లా నడుచుకుంటుందే. మరెందుకీ ఆభాసంతా? అశ్రుసిక్తమైన ముఖంతో తన భార్యవంట ఇల్లు విడిచిపోతూ తనుచూచింది, ఇప్పటికీ తన హృదయాన్ని కలచివేస్తోంది.

కామేశ్వరి కొడుకు శివరావు భోజనం చేస్తూంటే, అతన్ని ఊరికే అదేపనిగా పరిశీలించింది. పూర్తిగా మారిపోయాడు పెళ్లి అయిననాటినుంచీ! ఆమె పొరిగింటి స్నేహితురాలు రత్తమ్మ, చెప్పినవిషయం నిజమేఅయింది. తను మొదట్లో ఏమిట్లో అనుకున్నది. 'ఉమ శివరావును లోబరుచుకుంది ఇంత కొద్దికాలంలో! దీని పని పట్టిస్తాను. నన్ను ఆ ఆసరామాసుకొ నేగా ఈవిధంబుగా కంటగించుకుంటున్నది! ఊళ్ళో దీనికి తగినవాళ్ళే ఉన్నారు. వాళ్ళలక్ష్మి మాటేమిటి? అత్తగారినీ, మొగుణ్ణీ బుట్టలో పెట్టి అమ్ముతోంది! రేపు నాగతీ అంతే అవుతుంది. నేను సరియైన చర్య తీసికోక పోతే లాభం లేదు. నేను అలుసిస్తే, రేపు నానెత్తినే ఎక్కుతుంది! దాంట్లో సందేహం ఏం లేదు. మొక్కై వంగందే మ్రానై వంగునా అని ఊరికే చెప్పలేదు!!"

కామేశ్వరి మళ్లా కొడుకువైపు చూచింది. మళ్లా చూచింది! పుత్రవాత్సల్యంతో నిండిన తనహృదయాన్ని, తన కోడలు నిర్దాక్షిణ్యంగా కొలదన్నుతున్నట్లు భావించింది. తన కొక్కగా నొక్కడు! భర్త పోయినప్పణ్ణుంచి శివరావును అతిగారాబంగా పువ్వుల్లో పెట్టిపెంచింది. అలాంటి ప్రేమని ఒక్కసారిగా తను ఎలా వదులుకుంటుంది. మధ్య ఈ ఉమ ఎవరు?

"ఉమా! నేను ఏం చేయాలో తోచక సతమతమవుతున్నాను. నాకు తెలుసు నువ్వు పడుతున్న బాధ. మా అమ్మ ఇంత కఠినంగా మారిందేమా అని ఆలోచిస్తున్నాను. మొదటి రోజుల్లో ఇల్లా ఉండేదా? నిన్ను నా కన్న ఎక్కువరా చూస్తూవచ్చిందికదా! మరి ఇంతలో ఇంత మార్పేమిటి?" అని శివరావు ఆరాత్రి ఉమతో ఏంచెయ్యవలసింది, బుడ్డిదీపపు గుడ్డివెలుగులో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. అతనికి తనతల్లిపరివర్తనంతా తెలుసు. దీనికి కారణభూతురాలైన పొరుగింటి రత్తమ్మ అని కూడా తెలుసు. కాని తనేం చేయలేకపోతున్నాడు తన తల్లి చేతిలో తను కీలుబొమ్మ. ఆమెయాజమాన్యంలో, చిన్నతనంలో తండ్రి పోయినప్పట్నుంచీ పెరిగాడు. తను కోరినప్రకారం తను ప్రేమించిన ఉమనిచ్చి పెళ్ళిచేసింది. మొదట్లో అనుమానించటానికి వీల్లేనంత ప్రేమగా ఉంది తనభార్యయెడల. ఇప్పుడు ఆమె తన భార్యను సరిగ్గా చూపటం లేదని, తల్లిని ఎల్లా తిరస్కరించగలడు? అతనికి ఉమ చెప్పిన ఊహాయే ప్రస్తుతము కర్తవ్యంగా తోచింది. తనను పుట్టింటికి కొంతకాలంపాటు పంపించ' మంది...

"ఉమా! నాస్థితి నీకు అర్థమయిందికదా. నేను బుద్ధిపూర్వకంగా తల్లీహృదయాన్ని బాధించలేను. ముఖ్యంగా నేను ఆమెను తల్లిగా ప్రేమించటంలేదని అనుమానిస్తున్న సమయంలో! కాబట్టి ఇప్పుడు నేను కొంచం తెలివిగా ప్రవర్తించాలి. నిన్ను ఇప్పుడు మీ నాన్నగారింటికి పంపించటం ఇష్టం లేకపోయినా పంపించితీరాలి. అంతకన్న చేయదగిందేమీ కనిపించటంలేదు. అందుకు నన్ను క్షమిస్తావుకదూ" అన్నాడు శివరావు.

"నాకుమాత్రం ఇష్టంఅంటారా అల్లా చెయ్యటం? అయితే మీరుమాత్రం నన్ను అప్పుడప్పుడు చూడటానికి వస్తూండండేం. అల్లా మిమ్మల్ని నేను తరచు చూచే భాగ్యాన్ని కలిగించుకుంటాను...నా కోరిక చెల్లిస్తారా?" అంది ఉమ.

"అయ్యో! తప్పకండా. నిన్ను చూడకండా ఒక్కక్షణమైనా ఉండగలనా ఉమా? ఆవిషయం నీకు తెలియదూ. అబ్బా! ఈ ఎడబాటు నేను భరించలేను. అయినా భరించాలి. తప్పదు" అన్నాడు శివరావు.

"నేనుమాత్రం ఉండగలనా చెప్పండి. విధి మనల్నిద్దర్నీ ఇల్లా దూరంచేస్తోందని ఎంతో దుఃఖపడిపోతున్నాను. ఏమో కొంతకాలం

అయినతరువాత మీ అమ్మగారు నన్ను పూర్వంమాదిరిగా ప్రేమిస్తారేమో?" అన్నది ఉమ.

"అల్లాగే కోరుకుందాం ఉమా! లేకపోతే మనం కలిసిఉండటం ఎల్లా సంభవిస్తుంది?"

ఉమా శివరావులు నిశ్చయించుకొన్న ప్రకారం, మరుసటిరోజు, శివరావు ఉమను ప్రయాణం కట్టుమన్నాడు. తల్లితో చెప్పాడు. తల్లి ఒప్పుకుంది. ఆమె పెళ్లి స్నేహితురాలు రత్తమ్మతో సంప్రదించింది. "మళ్లా నీకొడుకుని నీవాడుగా చేసికోవటానికి ఇదే సమయం" అనికూడా చెప్పింది. ఉమ ప్రయాణమై వెళ్లిపోతుంటే, అయ్యో వెడుతున్నావా? అని కూడా అనలేదు. ప్రాణం కుదటబడినట్లయింది, బండి ఆ వీధి మలుపు తిరగగానే. కాని శివరావుమనస్సు తనేమి గ్రహించింది? అతను ఒక పెద్ద వేడి నిట్టూర్పు విడిచాడు.

శివరావు అన్నప్రకారం, ఉమదగ్గిరకి తరచు వెడుతూవచ్చాడు. ఉమక్షేమాన్ని గూర్చి చెబుదామని ఎన్నోసార్లు ప్రయత్నించగా, తల్లి కామేశ్వరి, ఆ ప్రసంగాన్ని తప్పిస్తూ వచ్చింది. అందువల్ల శివరావు చేయదగింది లేక మాట్లాడకండా ఊరుకున్నారు. కామేశ్వరికిమాత్రం శివరావు మళ్ళా తనవాడయాడనిమాత్రం అమితమైన సంతోషం లేకపోలేదు! భార్యవిషయం పూర్తిగా మరిచిపోయి మామూలుస్థితికి వస్తాడని ఆశపడింది. కాని తను ఎంతవాత్సల్యాన్ని చూపిస్తున్నా ఎంత సుఖాన్ని తల్లిగా అతనికి ఇస్తున్నా ఏదో లోపం ఉన్నట్లు ఆమె కనిపెట్టింది. ఎప్పుడూ ఏదో చికాకుతో, మనోవ్యాకులంతో ఉన్నట్లు గమనించింది...కారణం తెలుసుకో ప్రయత్నించింది. కాని లాభంలేకపోయింది. క్రమంగా అతను భోజనం సరిగా చేయటం మానివేశాడు. చిక్కిపోవట మొదలెట్టాడు! కామేశ్వరి గాభరాపడింది. అతనిని బాధిస్తున్న విషయ మేమిటా అని బాగా ఆలోచించింది. చాలాసార్లు అడిగింది కూడా. కాని అతను చెప్పలేదు. దాంతో ఆమెమనస్సుకూడా కలుక్కుమంది. ఏంచేయాలో తోచలేదు. ఒక రోజున, శివరావు ఏకాంతంగా తన గదిలో కూర్చొని ఉమఫోటోను తదేకంగా చూస్తూండటం, కనిపెట్టింది. "కారణం ఇదా?" అని మనస్సులో కోపంతో రగిలిపోయింది. 'ఇంకా ఈ పిశాచం వదలలేదన్నమాట! నేను ఎంత కష్టపడి వాడి సుఖానికోసం పాటుపడితేమాత్రం ఏంలాభం?"

ఆమెకు అమితమైన ఈర్ష్యకలిగింది. శివరావు అదేమో గమనించలేదు. గదిలోకి వచ్చిందని తల్లివైపు చూచాడు. తల్లికి నిజం తెలిసింది. ఆమె తన ప్రయత్నంలో ఓటమినే పొందాననుకొంది. విపరీతమైన ఒంటరితనాన్ననుభవించింది! తనవాడైన తను కన్నకొడుకైన ఈ శివరావు పరాయివాడయ్యాడు! తన కెవ్వరూలేరు! ఇంకా శివరావు ఆమెవైపు దీనంగా చూస్తూనే ఉన్నాడు! హఠాత్తుగా ఆచూపులో ఒక విన్నమైన ఆర్తనాదం వినిపించింది ఆమెకు. ఒక క్రొత్త ఆలోచన ఆమె నాక్రమించింది. ఆ ఆలోచన, పదిహేనేళ్ళకుపూర్వపు ఒక సన్నివేశానికి తీసికోపోయింది! అప్పుడు శివరావు ఆరేళ్లవాడు. బొద్దుగా బుగ్గలుపాలుకారుతూ పచ్చిగా ఉండేవాడు. కలకలలాడుతూ తనకు ఎంతోముద్దుగొలిపేవాడు.

అది సంక్రాంతి కామేశ్వరి 'శివ' ను సిల్కులాల్చితోనూ సిల్కుపైజామాతోనూ అలంకరించింది. గిరజీలు తిరిగున్న జుట్టు సరిదిద్దింది. ఎత్తుకొని దగ్గిరలోనున్న సంతకి తీసికొవెళ్లింది. సంతలో కోలాహలం చూచేటప్పటికే, శివకూ ఉత్సాహం పుట్టింది. "అమ్మా! అది కొని పెత్తవూ!" ఆ గిల్లున తిరిగే మొమ్మ కొనిపెత్తవూ!" అని ముద్దుగా అడిగాడు. తల్లి ప్రాధేయపు చూపు శిలను గుర్తుకు తెచ్చుకుంది. మళ్లా కామే ఇప్పటి తన కొడుకువైపుకు చూచింది. ఆమెకు ఆరేళ్లముద్దుబాలుడుగానున్న శివ గుర్తుకు వచ్చాడు. 'అచ్చంగా అవ్వే చూపులు!!" అప్పుడు శివకోరకని వెంటనే తీర్చింది. ఆ గిఱ్ఱునతిరిగే బొమ్మని కొనిపెట్టింది. ఇప్పుడు...ఆమెకళ్లు అశ్రుపూరితమైనయ్. కొడుకుదగ్గిరికి గబగబా నడిచింది. అతనిపక్కన కూర్చుంది. "నాయనా! నీ మనస్సులో ఏముందో చెప్పు! నీ సుఖమే నా సుఖము. నీ ఆనందమే నా ఆనందము. నాయనా! నీమనస్సు ఆవిధంగా కష్టపెట్టుకోకు. చెప్పు బాబూ! చెప్పు!" అని అతని జుట్టు ప్రేమతో నిమిరింది.

"శివరావు తల్లివైపు ఒక్కసారి చూచాడు. మళ్లా ఆమెవదనంలో పూర్వపు స్వార్థరహితమైన ప్రేమదృక్కును గమనించాడు. ఉత్సాహపూరితుడై, "అమ్మా! ఉమవిషయమే నన్ను బాధిస్తోంది. ఆమె ఇప్పుడు చూలాలు. ఆమెకక్కడ ఎవ్వరూ లేరు. ఆమె చాలా భారంగా ఉందని చాలా జాగ్రత్తతీసికోమని డాక్టర్లు చెబుతున్నారు. మనం శ్రద్ధతీసుకోకపోతే ఉమ ప్రాణం విడుస్తుంది." అని కళ్లవెంట నీళ్లు కారుస్తూ దీనంగా చెప్పాడు. తల్లి కొడుకుతలనుతన హృదయానికి హత్తుకొంది. తను చాలా కఠినురాలు! మూర్ఖురాలు! ఆమె అది గ్రహించలేదు. ఆమెకళ్లవెంట కూడా అప్రయత్నంగా నీళ్లుకారినయ్. "నాయనా! ఇంతేనా, కోడల్ని ఇవ్వాళేవెళ్లి తీసికోవద్దాం. దానికిమాత్రమూ లోపం జరగదు. ఆవిషయమై ఏవిధమైన బాధపెట్టుకోకు..." అని ఓదార్చింది. శివరావు తన చెవుల్ని తనే నమ్మలేకపోయాడు. కాని అతనికీ తెలుసు తన తల్లిహృదయం." ఆమె హృదయం వెన్నవంటిది. ఆహృదయం ఎప్పటికైనా కరుగుతుంది." అని తెలుసును.

కామేశ్వరీ శివరావువెళ్లి, ఉమని తీసికొవచ్చారు...జాగ్రతగా ఇంట్లో పురుడుపోసింది. కామేశ్వరి. క్రొత్తగా తల్లియైన ఉమ, క్రొత్తగా తండ్రియైన శివరావు ఉభయులూ చూచుకొని పరమానందంలో సిగ్గుపడటాన్ని, తల్లి కామేశ్వరి గమనించింది వాళ్లు తన పిల్లలు. వాళ్ల సుఖమే తన సుఖం. వాళ్ల ఆనందమే తన ఆనందం. ఆచిన్నపిల్లల్ని ఇంకా లాలించవలసిన బాధ్యత తనమీద ఉంది. ఉమ, అతిసుకుమారంగా కనిపించింది ఆమెకు. ఆమెలేనవ్వులో ఆమె కృతజ్ఞతను కనిపెట్టింది కామేశ్వరి. కామేశ్వరి తన కొడుకును ఉమ తననుంచి వేరు చేయ పూనుకోలేదని గ్రహించింది. తనే ఉమకు తన భర్తయెడలఉన్న అనురాగాన్ని అపార్థంచేసుకొంది! ఆమెతప్పు ఆమె గ్రహించింది. ఇప్పుడు ఆమెకు ఒక మనుమడు! ఆ చంటిబిడ్డ కేరింతలు కొడుతుంటే, తన హృదయంలోని నిర్మలమాతృప్రేమ మళ్లా మేల్కొంది. ఆ చంటిబిడ్డ, ఉమ, శివరావూ ఈ ముగ్గురూ తన బిడ్డలే! ముగ్గుర్నీ వాత్సల్యంతో ముద్దుపెట్టుకుంది.

"నాబిడ్డలు నా వార్ధక్యపు పిచ్చితనాన్ని మరిచిపోతారుగా...ఉమానన్ను మన్నించు. బాబూ! నన్ను క్షమించు...—గతాన్ని అందరం మరిచిపోదాం. మీ ముగ్గురూ నా బిడ్డలే. మీ ఆనందాన్ని నేను ఆనందిస్తాను." అని తల్లి కామేశ్వరి ముగ్గురిమీద తన విశాల హస్తాన్ని చాచి, విశ్వప్రేమను కురిపించింది!

నేటి ప్రపంచం:

# ★ ఇండోచీనాలో యుద్ధప్రజ్వలనప్రమాదం ★

# ★ హైడ్రోజన్ బాంబు ★

ఇండోచీనాలో రిపబ్లిక్ ఉద్యమకారులు స్థాపించిన ప్రభుత్వాన్ని రష్యా గుర్తించింది. ఒకరి దేశాల కొకరు రాయబారుల్ని పంపి స్నేహం సుస్థిరంచేసుకోడానికి నిర్ణయం చేసుకున్నారు. అంతకు పదిహేనురోజులకు ముందే చీనాకమ్యూనిస్టుప్రభుత్వం ఇండోచీనా రిపబ్లికన్ ప్రభుత్వాన్ని గుర్తించింది. రష్యాఅనంతరం జెకోస్లొవాకియా, పోలండ్ ప్రభుత్వాలు కూడా గుర్తించాయి.

రష్యా గుర్తింపుతో ప్రపంచరాజకీయ రంగంలో మరొకకలకలం చెలరేగింది. అమెరికా రష్యన్ ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శించింది. ఫ్రెంచి ప్రభుత్వం రష్యన్ ప్రభుత్వానికి అధిక్షేపణ తెలిపింది. రష్యా ఆక్షేపణపత్రాన్ని చూడనైనా చూడకుండా తిరగ్గొట్టింది. ఇండోచీనాలో తమ ప్రాబల్యాన్ని కాపాడుకోడానికి ఫ్రాన్స్ ఆఖరుసారి తీవ్రకృషి చేస్తోంది. సైనిక దళాల్నీ ఆయుధసామగ్రినీ విరివిగా రవానా చేస్తోంది. మరొకవంక రిపబ్లికన్లు తమ బలం వృద్ధిపరుచుకుంటున్నారు. ఇండోచీనాలో బావ్‌దాయ్ ప్రభుత్వం అధికారరీత్యా స్థాపితం కావడంతడువుగా ఆయుధాలు పంపడానికి అమెరికా సిద్ధంగా కూచుంది. పరిస్థితి చూస్తే గ్రీస్‌లో అమెరికన్ సైన్యాల ఆధ్వర్యంకింద గ్రీక్ ప్రభుత్వానికీ, యుగోస్లావ్ కమ్యూనిస్టుల ఆధ్వర్యం కింద గ్రీక్ గొరిల్లాలకు మధ్య జరిగిన మాదిరిగా ఇండోచీనాలో కూడా యుద్ధం ప్రారంభమయే ప్రమాదం కనిపిస్తోంది. మూడేళ్లనించి యుద్ధంచేస్తున్నా గెలవలేక సైనికశిబిరాల్లోనే నిలిచిపోయిన ఫ్రెంచి సైన్యాలకి అమెరికా ఆయుధాలు పంపడానికి ఏర్పాటు చేస్తోంది. ఫ్రెంచిప్రభుత్వం ఇంకా అదనపుసైన్యాల్ని ఇండోచీనాకు పంపుతోంది. మరొకవైపున రిపబ్లికన్ ఉద్యమకారులకి చీనాకమ్యూనిస్టులు ఆయుధాల్ని సరఫరా చేస్తున్నారని వదంతులు వ్యాపిస్తున్నాయి. అంతేకాదు రిపబ్లికన్ సైన్యాలలో చీనా కమ్యూనిస్టులు చేరుతున్నారని కూడా వార్తలు వ్యాపిస్తున్నాయి. మొత్తానికి త్వరలోనే ఇండోచీనాలో యుద్ధం ప్రజ్వలించే సూచనలు కానవస్తున్నాయి. గ్రీస్‌లో మాదిరిగానే ఇక్కడకూడా యుద్ధంలో విజయం వెనకఉండి మద్దతు ఇచ్చేవారిపైనే ఆధారపడిఉంటుంది. గ్రీస్‌లో కమ్యూనిస్టులికి సహాయంచేసిన యుగోస్లావ్ ప్రభుత్వం రష్యాతో విరోధపడి అకస్మాత్తుగా గ్రీక్ కమ్యూనిస్టులపైన కూడా కత్తిగట్టడంతో గ్రీస్‌లో పరిస్థితి తారుమారయిపోయింది. వాస్తవానికి గ్రీస్‌లో కమ్యూనిస్టు గొరిల్లాసైన్యాల్ని నిర్మూలించి గ్రీక్ ప్రభుత్వం విజయం సాధించిందంటే ముఖ్యకారణం గ్రీక్ ప్రభుత్వ సైన్యాల బలమూ కాదు. అమెరికన్ సైనికసహాయమూ కాదు. యుగోస్లావియా గ్రీక్‌కమ్యూనిస్టులికి సహాయం చెయ్యడం మాని విరోధం సాధించడం ఎప్పుడు మొదలెట్టిందో అప్పుడే గ్రీక్ ప్రభుత్వానికి విజయం లభించింది. కాని తమ బలంవల్లనే జయం సాధ్యమయిందని భావిస్తున్న అమెరికన్లు గ్రీస్‌లో అనుభవాన్ని ఇండోచీనాలో అమలుజరపడానికి ప్రయత్నిస్తున్నారు. ఇందుకోసమే ఫ్రెంచి ప్రభుత్వంపైన ఒత్తిడి తెచ్చి ఇండోచీనాలో రిపబ్లికన్లకు ప్రతిగా జాతీయ ప్రభుత్వం ఒకటి స్థాపించి ఆ ప్రభుత్వానికి రాజకీయస్వాతంత్ర్యం ఇవ్వాలని సూచించారు. ఫ్రెంచిప్రభుత్వం అంతవరకూ రిపబ్లికన్ నాయకుడు డా॥ హోచిమిన్‌తో జరుపుతున్న సంప్రదింపులికి స్వస్తిచెప్పి, అకస్మాత్తుగా వారిపైన దాడి ప్రారంభించింది. రాయబారాలు జరుపుతూ జరుపుతూ ఫ్రెంచి ప్రభుత్వం అకస్మాత్తుగా తలపెట్టిన ఈ ద్రోహంవల్ల ఇండోచీనా ప్రజల్లో ఫ్రెంచివాళ్లపట్ల విపరీత ద్వేషక్రోధాలు పెరిగాయి.

అయితే అమెరికా ఇచ్చిన సలహాలో కొంతవంతే ఫ్రెంచిప్రభుత్వానికి నచ్చింది. రిపబ్లికన్లకి ప్రతిగా జాతీయప్రభుత్వాన్నొకటి స్థాపించడానికి ఒప్పుకున్నారు. పూర్వ అనాంచక్రవర్తి బావ్‌దాయ్‌ని ఈ ప్రభుత్వానికి అధిపతిగా పెట్టడానికి ఒప్పుకున్నారు. కాని ఆ ప్రభుత్వానికి పూర్తి రాజకీయస్వాతంత్ర్యం ఇవ్వడంమాత్రం ఫ్రెంచిప్రభుత్వానికి ఇష్టం లేదు. బావ్‌దాయ్ ప్రభుత్వానికి ఎంతవరకూ అధికారమివ్వవచ్చునన్నవిషయంపైన దీర్ఘకాలం చర్చలు జరిగాయి.

బావ్‌దాయ్‌ని తమ చేతిలో కీలుబొమ్మగా పెట్టుకుని పూర్తిగా పాలనాధికారం తమ చేతుల్లోనే ఉంచుకోవాలని ఫ్రెంచివారి యత్నం. బావ్‌దాయ్‌కీ, ఫ్రెంచిప్రభుత్వానికీ మధ్య పారిస్‌లో సంవత్సరంపైగా చర్చ జరిగింది.

ఈ చర్చ లెంతకీ తెగక సమాధానం కుదరకపోయేసరికి, ఉత్తరాన చీనాకమ్యూనిస్టుల ఉపద్రవం ముంచుకువస్తూన్నప్పుడు తిరిగి అమెరికా ఫ్రెంచి ప్రభుత్వం పైనా బావ్‌దాయ్ పైనా ఒత్తిడి తెచ్చి ఏదో ఒకవిధంగా వెంటనే రాజీ చేసుకోవాలని తెలియచేసింది. చివరికి ఒక ఒడంబడిక కుదిరింది. కాని ఈ ఒడంబడికలో బావ్‌దాయ్‌కి పూర్తి రాజకీయ స్వాతంత్ర్యం ఇవ్వబడలేదు. కమ్యూనిస్టుల పరమౌతున్న దేశాన్ని ఏరీతిగానైనా కాపాడుకోవాలనే ఆత్రంతో బావ్‌దాయ్ రాజీపడ్డాడు. ఈరాజీప్రకారం ఇండోచీనాలో ఫ్రెంచివారికి ప్రత్యేకహక్కులు అధికారాలు ఇవ్వబడినాయి. బావ్‌దాయ్ ప్రభుత్వం తూర్పుఆసియాలోని కొన్ని

దేశాల్తో తప్ప ఏ ఇతరదేశాలతోనూ రాయబారవ్యాపారాదిసంబంధాలు పెట్టుకోకూడదని ఒడంబడికలో విధించబడింది. ఇతరదేశాలతో వ్యవహారాల్ని ఫ్రెంచి ప్రభుత్వ ప్రతినిధులే నిర్వహిస్తారు. ఇండోచీనా రక్షణకోసం, ఫ్రెంచిసైన్యాలు ఉంటాయి. వ్యాపారాదివిషయాల్లో ఫ్రెంచివారి హక్కుల్లో జోక్యంచేసుకునే అధికారం బావ్‌దాయ్ ప్రభుత్వానికి ఉండదు. ఇండోచీనాలో ఫ్రెంచివారిపైన కేసులు విచారించాలంటే ఫ్రెంచిఅధికారులే విచారించాలికాని స్థానికన్యాయస్థానాలికి విచారణచేసే అధికారం లేదు. ఇటువంటి షరతులికి బావ్‌దాయ్ అంగీకరించాడు.

ఒడంబడికప్రకారం బావ్‌దాయ్ ప్రభుత్వం తాత్కాలికంగా స్థాపించబడింది. కాని ఇంకా పరిపాలనాధికారం ఆ ప్రభుత్వానికివ్వబడలేదు. అయితే ఆ ప్రభుత్వం పేరుతో ఇండోచీనావాసుల్ని చేర్చి ఫ్రెంచిసైనికాధికారులు "ఇండోచీనా జాతీయసైన్యాల్ని" నిర్మించడం ఆరంభించారు. ఈ జాతీయసైన్యాలు ఫ్రెంచి సైన్యాల ఆధ్వర్యంకిందనే నిర్వహించబడుతున్నాయి.

బావ్‌దాయ్‌ప్రభుత్వానికి ప్రభుత్వాధికారమిచ్చే శాసనం ఫ్రెంచిశాసనసభలో ఈవారమే ఆమోదించబడింది. ఇంక త్వరలో అధికారదత్తత జరుగుతుంది. జరగ్గానే బావ్‌దాయ్ ప్రభుత్వాన్ని గుర్తించడానికి అమెరికా చురుగ్గా ఏర్పాట్లు చేస్తోంది. బ్రిటిష్ కామన్వెల్తులోని ఆసియాదేశాలచేత కూడా, అనగా భారతదేశం, పాకీస్తాన్, సింహళాలచేత కూడా బావ్‌దాయ్ ప్రభుత్వాన్ని గుర్తింపచెయ్యాలని అమెరికా సంకల్పం. కొలంబోలో జరిగిన కామన్వెల్తు విదేశాంగమంత్రుల సమావేశంలో ఈ విషయమై చర్చించబడింది. వాస్తవానికి తూర్పుఆసియాలో అమెరికా అనుసరించబోయే విధానంపట్ల భారతదేశం పాకీస్తాన్ల అభిప్రాయాలెలా ఉంటాయో కనిపెట్టడానికే కొలంబోలో కామన్వెల్తు విదేశాంగమంత్రుల సమావేశం జరిగిందని కొందరి ఊహ. ఈ దేశాల అభిప్రాయాల్ని కొలంబోలో తెలుసుకోగలిగారు. కాని ఫలితం బ్రిటిష్‌వారికిగాని అమెరికన్లకిగాని తృప్తికరంగా లేకపోయింది. బావ్‌దాయ్ ప్రభుత్వాన్ని గుర్తించడానికి పండిట్ నెహ్రూ నిరాకరించారు. ఆస్ట్రేలియా కెనడా న్యూజీలాండ్‌లు బ్రిటన్‌కంటేకూడా మక్కువగా అమెరికాఅడుగుజాడల్లో నడవగలవు. భారతదేశం ఈ ఒత్తిడికి లొంగకపోయినందుకు మిగతా కామన్వెల్తుదేశాలవారందరికీ అసంతృప్తి కలిగింది. ఈ అసంతృప్తి కాశ్మీరవివాదం విషయంలో ఎలాగూ పనిచేస్తూనే ఉంది. ఏదోవిధాన భారతదేశాన్ని లొంగదీసుకోవాలనే ప్రయత్నాల్ని వారింకా మానలేదు. ఇండోచీనాలో ఏప్రభుత్వాన్ని భారతదేశం గుర్తిస్తుందో ఆ ప్రభుత్వంవైపుకే ఆసియాలోని మిగతా దేశాలుకూడా మొగ్గతాయనే విషయం వారికి తెలుసును. అందువల్లనే, బావ్‌దాయ్‌ప్రభుత్వాన్ని గుర్తించకపోతే మానెగాని రిపబ్లికన్ల ప్రభుత్వాన్నిమాత్రం గుర్తించకుండా ఉండగలరని పండిట్ నెహ్రూవద్ద కొలంబోలో బ్రిటన్, కెనడా, ఆస్ట్రేలియాలు వాగ్దానం తీసుకున్నాయని వినికిడి.

ఈ విషయాన్ని గ్రహించిన రష్యా ఇండోచీనాలో వియత్‌మిన్ రిపబ్లికన్ ప్రభుత్వాన్ని గుర్తించి రెండు కార్యాలు ఒక్కదెబ్బతో సాధించింది. 1. ఫ్రెంచివారికి ఇండోచీనాలో స్థానబలం లేకుండా చెయ్యడం 2. కామన్వెల్తుదేశాలమధ్య క్రమక్రమంగా కుదురుతున్నట్లు కనిపిస్తున్న సహకారస్నేహాల్ని భగ్నపరచడం.

కమ్యూనిస్టు ప్రభుత్వాలు లేని దేశాలన్నిటినీ కూడగట్టుకుని తన ఒక్కమాటమీద నడిపించి, ఐక్యరాజ్యసమితివ్యవహారాలన్నిటిలోనూ కమ్యూనిస్టువర్గానికి పరాభవం చెయ్యాలనీ, ఇంతవరకూ కమ్యూనిస్టులకు దక్కినది దక్కగా మిగిలిన దేశాలనైనా కమ్యూనిస్టుల పాలపడకుండా రక్షించడానికి ఆ దేశాలన్నిటినీ తన ఒద్దిలోకి తెచ్చుకోవాలనీ అమెరికా తీవ్రప్రయత్నాలు చేస్తోంది. పండిట్ నెహ్రూనీ, పాకీస్తాన్ ప్రధానమంత్రినీ, ఇరాన్ సుల్తాన్‌నీ ఆహ్వానించడంలో అమెరికా ముఖోద్దేశం ఇదే. కాని ఒక పెద్ద యూరోపియన్ సామ్రాజ్యవర్గానికీ మరొక పెద ఆసియాఆఫ్రికన్ జాతీయవర్గాలకీ మధ్య సమరసం పొసగడంలేదు. ఎక్కడికక్కడే వారిలో వైషమ్యాలు అడ్డొస్తున్నాయి. యూరోపియన్ దేశాలమధ్య పూర్వంకంటే ఇప్పుడు సహకారం మేలుగానే ఉంది. కాని ఆసియాలోనే సాధ్యపడటంలేదు. అందువల్ల అమెరికా ఆసియాలో జాతీయోద్యమాల్ని బలపరిచి ఈ సహకారం సాధించాలని యత్నిస్తోంది. కాని సామ్రాజ్యవాదులచేత జాతీయప్రభుత్వాల స్థాపనకి అంగీకరింపచెయ్యడం అంత సులువుగా లేదు. అమెరికన్ల ఈయత్నాల్ని ఎలాగైనా భగ్నపరచడమే రష్యా లక్ష్యంగా పెట్టుకుంది. రిపబ్లిక్ అయినా కామన్వెల్తులోనే ఉండడానికి అంగీకరించిన భారత కాంగ్రెస్ ప్రభుత్వాన్ని మస్కోరేడియో దుమ్మెత్తిపోస్తోంది. నీతికీ న్యాయానికీ మాత్రమే నిలుస్తానని వాదించే భారత ప్రభుత్వం బ్రిటిష్ అమెరికన్ వర్గానికంతగా కలిసిరాకపోయినా, కామన్వెల్తుసమావేశాల్ని ఇంకా జోరుగా జరిపి భారతప్రభుత్వాన్ని ఇరికించడానికి ప్రయత్నిస్తున్నారు. కామన్వెల్తుతో స్నేహబాంధవ్యాలు అమూల్యమైనవని ఎంత పొగుడుతున్నప్పటికీ భారతదేశం ఈ ఉచ్చులో చిక్కడం లేదు. ఇప్పటివరకూ చిక్కలేదు.

కమ్యూనిస్టులు చీనాతరవాత భారతదేశంపనిపట్టించడానికి నిశ్చయించుకున్నారని చియాంగ్ కైషేక్ ప్రచారం చేస్తున్నాడు. టిబెట్ స్వాతంత్ర్యాన్ని కాపాడాలనే భారతదేశం వాంఛిస్తోందన పుకార్లు పుట్టించి కమ్యూనిస్టు చీనాకూ భారతదేశానికీ మధ్య వైషమ్యం రెచ్చగొట్టడానికి అమెరికన్ పత్రికలు ప్రచారం చేస్తున్నాయి. కాని భారతదేశం ఈ ఉచ్చులో ఇంతవరకు చిక్కలేదు. అయితే రష్యా చీనాప్రభుత్వాలు తొందరపడి దుష్ప్రచారాలకీ, దూషణలకీ దిగి కోరి విరోధం తెచ్చుకుంటే అప్పుడు భారతప్రభుత్వం ఏమి చేస్తుందో చెప్పడం కష్టం. కాని ఇప్పటివరకూ ఉభయవర్గాలమధ్య విరోధాల్లోనూ అంతగా చిక్కుకోకుండా, ఇటు బ్రిటిషు అమెరికన్ స్తోత్రాలకు పొంగిపోకుండా అటు కమ్యూనిస్టుల దుష్ప్రచారానికి అకారణవిరోధం సాధించకుండా భారతప్రభుత్వం తటస్థవిధానాన్ని కాపాడుకుంది. దీనికి ఉదాహరణ ఇండో-చీనాపట్ల భారతప్రభుత్వ విధానమే. ఇండో

చీనాలో డా॥ హోచిమిన్ స్థాపించిన ప్రభుత్వం ప్రభుత్వం కాదనీ, రిపబ్లికన్లు కేవలం తిరుగుబాటుదార్లనీ ఫ్రెంచి ప్రభుత్వం ప్రకటించింది. వాస్తవానికి మొదట ఫ్రెంచి ప్రభుత్వం ఎవతో జరిపిందో ఆ రిపబ్లికన్ ఆ ప్రభుత్వాన్ని, అనగా వారు రిపబ్లికన్ ప్రభుత్వవ్యవస్థను ఆమోదించినట్లయిందనీ, ఆతరవాత పరాయి సైన్యాల మద్దతుతో తనప్రభుత్వం స్థాపించుకోవాలని ప్రయత్నిస్తున్న బావ్‌దాయ్ వర్గమే తిరుగుబాటుదారులనీ రష్యా సమాధానమిచ్చింది. ఐక్యరాజ్యసమితివారి ఆర్థిక సాంఘికవిద్యాది విషయసంస్థ దూరప్రాచ్య సమావేశం జరిగినప్పుడు ఇండోచీనా ప్రతినిధిగా, ఫ్రెంచిప్రతినిధిని చేర్చుకోవాలా లేక వియత్‌మిన్ రిపబ్లిక్ ప్రభుత్వప్రతినిధిని చేర్చుకోవాలా అనే ప్రశ్న వచ్చినప్పుడు, ఇండోచీనాలో ఉభయవర్గాలూ చెరి సగం ప్రాంతాల్ని పరిపాలిస్తున్నాయి కాబట్టి ఉభయవర్గాల ప్రతినిధుల్ని చేర్చుకోవాలని భారతప్రభుత్వప్రతినిధి వాదించాడు.

ఇంక ఇప్పుడు ఇండోచీనాసమస్యపైన రష్యావైఖరిపట్ల ఫ్రెంచిప్రభుత్వం తీవ్ర క్రోధం ప్రకటించింది. ప్రతీకారం ఏమి చెయ్యాలనే విషయంపైన బ్రిటిష్ అమెరికన్ ప్రభుత్వాలతో ఫ్రెంచి రాయబారులు సంప్రదింపులు జరిపారు. పర్యవసానం ఇంకా తేలలేదు. ఫ్రాన్స్ రష్యాతో రాయబారవ్యాపారసంబంధాలు తెంపుకుంటుందని కొన్ని వదంతులు బయలుదేరాయి. ఇండోచీనాకి సైనికుల్నీ ఆయుధసామగ్రినీ చురుగ్గా పంపుతున్నారు. చివరికి ఇండోచీనాలో గ్రీస్‌లో జరిగినట్లు తీవ్రయుద్ధం కల్లోలం రేగినా రేగవచ్చు. లేదా కొరియాలో జరిగినట్లు దేశం రెండుగా చీలిపోయి ఉభయప్రభుత్వాల పరిపాలన నిరాటంకంగా సాగిపోనూవచ్చును. రష్యా అమెరికాల వైరంఫలితంగా కొరియా, జర్మనీలతరవాత రెండుముక్కలుగా చీలిపోయిన మూడో దేశం ఇండోచీనా. (బ్రిటిష్‌దుస్తంత్రాలవల్ల చీలిపోయినదేశాలు మూడు; 1. లిబియా 2. భారతదేశం. 3. పాలస్తీనా)

## హైడ్రోజన్ బాంబు:

ఏటంబాంబులు తయారుచేసి రెండు జపనీస్ నగరాల్నీ, లక్షలాది నిరాయుధ ప్రజల్నీ బూడిదచేసిన అమెరికా ఇప్పుడు అంతకంటే పెద్దబాంబు తయారు చేస్తోంది. దీనిపేరు హైడ్రోజన్‌బాంబు. పదార్థాన్ని విడగొట్టగా విడగొట్టగా చిట్టచివరికి మిగిలే అణువుని మళ్లీ బలవంతంగా బద్దలుగొట్టితే కనీవినీ ఎరగని మహాశక్తి పుట్టి చుట్టుపక్కల రెండున్నరచతురపుమైళ్ల మేర గడ్డిపరకేనా మిగలకుండా సర్వం మలమలమాడిపోవలసిందే. ఇది బద్దలుకొట్టే అణువు యురేనియంకి చెందినదైతేను. కాని అదే ఉదజని (హైడ్రోజన్) అణువుని బద్దలుగొట్టినట్లయితే నూరుచతురపుమైళ్లమేరంతా పురుగేనా మిగలకుండా నాశనమైపోతుందిట. అయితే హైడ్రోజన్ బాంబు దానంతటది పనిచెయ్యదు. తుపాకి పేల్చడానికి మునివేలుతో కొక్కెం లాగవలసి వున్నట్లే హైడ్రోజన్ బాంబుని పేల్చాలంటే ఆ బాంబులో మామూలు చిన్న ఏటంబాంబు పెట్టి (జపనీస్ నగరాల్ని నాశనంచేసిన ఏటంబాంబులు అప్పుడే మామూలుబాంబులయిపోయినాయి) అప్పుడు దీంతో ఆ పెద్ద బాంబుకి చిచ్చుఅంటించాలి. అంటే తూటా వెలిగించడానికి అగ్గిపుల్ల ఎల్లాగో హైడ్రోజన్ బాంబుకి ఏటంబాంబు అల్లాగ.

మొత్తానికి ఒకదానికిమించినది మరొకటి. ఈ మారణాయుధాల నిషేధానికి ఐక్యరాజ్యసమితివారి భద్రతామండలి ఏదో ఒక ఏర్పాటుచేసేసరకూ ఈలోగా హైడ్రోజన్ బాంబుతయారీకి కార్యకలాపం కొనసాగుతూ ఉండవలసిందేనని ఉత్తరువిచ్చినట్లు అమెరికాఅధ్యక్షుడు ట్రూమన్ ఈ వారం ప్రకటనచేశాడు. అంతక్రుముందు ఇది తయారుచెయ్యాలా వద్దా అనే విషయంపైన పత్రికల్లోనూ, ప్రభుత్వవర్గాల్లోనూ చాలా రోజులు తర్జనభర్జనలు జరిగాయి. వాని పర్యవసానం, ట్రూమన్ ప్రకటన. ఇంక హైడ్రోజన్ బాంబుతయారీ చురుగ్గా మొదలెడతారని కొందరన్నారు. కాదు ట్రూమన్ ప్రకటన చూస్తే, ఇదివరకే తయారుచేసినట్లు కనిపిస్తుందని కొందరన్నారు. దీంతో రష్యాని వెనక్కినెట్టేశాం అని కొన్ని అమెరికన్ పత్రికలు వ్రాశాయి. కొందరు అమెరికన్ శాసనసభ్యులుకూడా ఇలాగే అన్నారు. కాని రష్యాలో ఇంతకుముందే తయారై ఉండవచ్చని కొందరంటున్నారు. అదేదీ నిర్ధారణగా తెలియకపోయినా అమెరికాలో ఇప్పుడు తయారుచెయ్యడానికి నిశ్చయమైపోయినందువల్ల నైనా రష్యాలో ఇదివరలో తయారుకాకపోతే ఇప్పుడైనా తయారుచెయ్యగలరు. ఈ బాంబులు తయారుచెయ్యడం ఏమంత బ్రహ్మవిద్య కాదని విజ్ఞానశాస్త్రవేత్తలు చెప్తూనేఉన్నారు. ఎవరు ముందనుకోడంలో కాదనడం అవునడం వ్యర్థం.

ఒకటిమాత్రం నిజం ఈ బాంబుల తయారీతో అమెరికాఆర్థికవ్యవస్థలో పెద్ద మార్పులు రావచ్చును. ఒక్కొక్క హైడ్రోజన్ బాంబు తయారీకి ముప్ఫైకోట్లడాలర్లు ఖర్చుపెట్టవలసివస్తే అమెరికాప్రభుత్వం ఎలా తట్టుకోగలదు? ఇది లాభాలార్జించే పెట్టుబడి కాదు. ఇంత ధనం లాభార్జనతో నిమిత్తంలేకుండా ప్రజోపయోగమైన కార్యాలకి కాకుండా, ఉత్తరోత్తరా ప్రతిఫలం వస్తుందనైనా ఆశలేకుండా, కనీసం వ్యాపారానికైనా వీల్లే

(16-వ పేజీ చూడుడు)

ఢిల్లీ లేఖ:

# ఉద్యోగాల ఎద్దడి

శ్రీ కృష్ణ

**1945** లో ఉద్యోగాల సంఖ్య తారస్థాయి అందుకుంది. కాని యుద్ధం ముగియటంతో మళ్లీ వెనకబట్టింది. అప్పటినుంచీ కోలుకోవటం కనబడలేదు.

ప్రభుత్వానికి ఈ విషయంలో కాలతబద్ధలైన ఎంప్లాయ్‌మెంటు ఎక్స్ఛేంజి లెఖ్ఖలను బట్టి చూస్తే, 1948 సెప్టెంబరుదాకా ఉద్యోగాలు దొరకినవారి సంఖ్య క్రమక్రమంగా పెరుగుతూవచ్చింది కాని, అప్పటినుంచీ వరుసగా తగ్గిపోతూవచ్చింది.

1948 జూలై-డిసెంబరు నుంచి, 1949 జనవరి-జూన్ వరకూ, ఉద్యోగాలు దొరికిన సంఖ్య 143,626 నుంచి 141,647 కు తగ్గిపోయింది. అయితే ఉద్యోగాలకు రిజిస్టరుచేసికొన్న సంఖ్య 1948, జూలై - డిసెంబరులో 4,73,958 నుంచి, 1949 జనవరి - జూన్ నాటికి 5,55,775 దాకా పెరిగిపోయింది. 1949 సెప్టెంబరుఅంతానికి ఉద్యోగాలు దొరికిన సంఖ్య మరింత తగ్గి ఆ మూడు మాసాలకు 60,709 కి దిగింది. 1948 లో అదే మూడు మాసాలకు 71,447 గురికి ఎక్స్ఛేంజిద్వారా ఉద్యోగాలు దొరికాయి.

జనవరి 1,1948 నుంచి, ఆగస్టు 31,1949 దాకా రిజిస్టరయిన నిరుద్యోగులసంఖ్య 7,62,718. ఇందులో ఉద్యోగప్రవేశాలు 1,84,160 మాత్రమే. ఉద్యోగాలు దొరికిన సంఖ్యాతారతమ్యంలో ఇదే అత్యధికసంఖ్య అని చెప్పవచ్చును. ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజికయే ఖర్చులుకూడా లభ్యమయ్యాయి. 1948-49 లో ఈశాఖకు 185 లక్షల రూపాయలు వ్యయమయ్యాయి. 1949-50 బడ్జెటులో, 204 లక్షల ఖర్చువరకూ అంగీకరించారు. అంటే జనవరి జూన్ 1949 వరకూ, ఆరునెలల్లో 1,41,647 గురు మనుష్యులకు ఉద్యోగాలు సమకూర్చిపెట్టడానికి, రూ. 97,25,000 రూపాయలు ఖర్చవుతున్నాయని తేలికగానే లెఖ్ఖ తెలుస్తుంది. 1948-49 లో చివరి మూడు నెలలకు, రూ 46,25,000 రూపాయలు, 1949-50 లో మొదటి మూడునెలలకు 51,00,000 రూపాయలూ ఖర్చయాయి.

బొంబాయి, మద్రాసు, పశ్చిమబెంగాల్ ప్రదేశాలలో, ఆర్డినెన్సుఫాక్టరీలు, డిపోలు, మరికొన్ని పరిశ్రామికసంస్థలూ ఎత్తివేసి, ఉద్యోగులను తొలగించివేయటమే, ఉద్యోగాలసంఖ్య మందగించటానికి కారణమని ప్రభుత్వకార్మికమంత్రివర్గంవారు చెప్పికొన్నారు. ఈ తీతలెఖ్ఖలు ఇల్లా ఉంటగానే కార్మికమంత్రివర్గం ఇదొకటికూడా చెప్పుకుంటున్నారు.

"ఎంప్లాయ్‌మెంటు ఎక్స్ఛేంజిసంస్థ యొక్క కార్యక్రమాభివృద్ధి చాలా తృప్తికరంగా ఉంది. 1949 ఫిబ్రవరి 28 దాకా, దేశంలో 54 ఎంప్లాయ్‌మెంటు ఎక్స్ఛేంజీలు, ఇరవైముగ్గురు జిల్లా ఎంప్లాయ్‌మెంటు ఆఫీసరులూ, ఉండేవారు. ఆతర్వాత ఆరునెల్లలో, మరో ఇరవైతొమ్మండుగురు జిల్లాఆఫీసర్లను నియమించాము."

పోనీ! నిరుద్యోగసమస్య కొంతైనా తీరింది!

ఆర్థికపరిస్థితులనుబట్టి 1950-51 లో ఈ సంస్థకోసం అయ్యే బడ్జెటు ఖర్చులో ఒక రూ.50 లక్షలు తగ్గించి 135 లక్షలకు పరిమితంచేసుకొంటారట. అయితే "(హెడ్ క్వార్టర్సులోనూ, జిల్లాల్లోనూఉన్న ఆఫీసర్లూ, గుమాస్తాలూ, చాలా ప్రయాసపడి పనిచేయవలసివస్తుంది" అని విచారిస్తున్నారు. పన్నులు కట్టుకోవలసిన ప్రజలపై 136 లక్షల రూపాయలభారమూ, ప్రయాసామాత్రం అంత లెఖ్ఖలోది కాదు. సైన్యంలో ఉద్యోగాల సంఖ్య తగ్గించుకోవలసి ఉండి, డిప్రెషన్ ఏ నిమిషానవచ్చి పడుతుందో అన్నస్థితిలో, ఆఫీసర్లకూ, గుమాస్తాలకు కలిగే (శ్రమ) భరించరానిదిగానే ఉంటుందాయెను!

కార్మికమంత్రిశాఖావారి మరో ప్రవచనం:

"కేంద్రప్రభుత్వము, ముఖ్యపరిశ్రమలను, సక్రమంగా పనిచేయించి అభివృద్ధిలో తెచ్చే బాధ్యత వహించింది కాబట్టిన్నీ ఈ ఆదర్శము నెరవేరాలంటే, కుశలులైన టెక్నిషియన్లు, కార్మికులూ అవసరం కాబట్టిన్నీ, ఇట్టి వృత్తులలో టెక్నికల్ శిక్షణలన్నిటినీ, ఏకముఖంగా కేంద్రీకరింపవలసిన అవసరం కూడా కేంద్రప్రభుత్వానికి కలుగుతూంది."

అంటే ఐ. యల్. ఓ, లో ఇండియాకు కూడా సభ్యత్వం ఉందికాబట్టి, కేంద్రప్రభుత్వం ఎంప్లాయ్‌మెంటు ఎక్స్ఛేంజిలను పనిచేయించక తప్పదు. డాక్టరుముఖర్జిగారు ఇండస్ట్రీస్ రెగ్యులేషను బిల్లు పెట్టారు కాబట్టి, ఈ వృత్తి విద్యాశిక్షణాలయాలు కూడా కేంద్రమే నడిపించకతప్పదు, ఇల్లా చూసుకొంటే కార్మికులు ఆరోగ్యవంతులు లభ్యమవాలికాబట్టి, ఆరోగ్య, వైద్య ఉద్యోగాలు కూడా, కేంద్రమే స్వయంగా ఏకోన్ముఖం చేసుకోవలసిఉంటుంది. ఇదేపద్ధతిని, ప్రతి కేంద్రమంత్రివర్గశాఖా కూడా, రాష్ట్రాల అధీనంలో ఉన్న విషయాలలోకి చొచ్చుకుంటూ పోవచ్చును.

కార్మికమంత్రుల సమావేశంలో ని ఈతీర్మానం కొంత గమనించతగ్గది.

1. ఎంప్లాయిమెంటు, ట్రైనింగ్ ప్రణా

లికలను రెంటినీ, శాశ్వతశాఖలుగా చేయవలెను.

2. జూలై 1950 తర్వాత ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజీలను, ట్రెయినింగ్ కేంద్రాలను రాష్ట్రప్రభుత్వాలు, తమ అధీనంలోకి తీసికోటానికి సుముఖంగానే ఉన్నప్పటికీ, నిత్యఖర్చులలో 60 40 పాళ్ళుగా ఇప్పటి దామాషాలోనే, కేంద్రప్రభుత్వంకూడా ఖర్చు భరించుకొంటేనే తప్ప, రాష్ట్రాలు ఈ శాఖలను భరించలేవు.

3. ఈపద్ధతిలో వీటిని రాష్ట్రప్రభుత్వాలకు అప్పచెప్పటానికి కేంద్రప్రభుత్వం సంసిద్ధం గానిపక్షంలో, 1950 జూలై తర్వాతకూడా, ఎంప్లాయ్‌మెంటు ఎక్స్ఛేంజీలు, ట్రెయినింగ్ సెంటర్లూ యథాతథంగానే నడపవలసిఉంటుంది."

న్యూఢిల్లీలో వార్తలనుబట్టి, రాష్ట్రాలు ఎంప్లాయ్‌మెంటు ఎక్స్ఛేంజీలు నడపటానికి కేంద్రప్రభుత్వ సహాయం లేకపోయినా నడపటానికి సిద్ధంగానే ఉన్నాయట. అయితే, కేంద్రఉద్యోగజీతాలఫాయిదాలో కాక రాష్ట్రాలజీతాలఫాయిదాలోనే, సంస్థ ఉద్యోగులకు జీతాలిస్తేనే నిలుపగలమన్నాయట.

## వ్యవసాయశాఖ

ఇండో-పాకిస్తాన్ వ్యాపారఘర్షణను ప్రభుత్వ వ్యవసాయశాఖ సంపూర్ణంగా వినియోగించుకొంటోంది. గోగునారను స్వయం సమృద్ధంగా కల్పించుకొనేందుకు 24 లక్షల అదనపు వ్యయం, స్వయంపోషకంగా పత్తి పండించుకొనేందుకు అదనంగా 70 లక్షల రూపాయలు కావలసివచ్చాయి. పైయేడు నదులు బాగుచేయటానికి 22 కోట్లు వ్యయం దీనికి కల్పుకోవాలి. ఇంకా ధాన్యసేకరణ ఖర్చు 2 లక్షల 40 వేలు. అధికాహారోత్పత్తి ప్రచారం, పోస్టరులు, కరపత్రాలు, సినిమాలద్వారా చేసేందుకు కావాలి. ఈ ప్రచారం. రైతు "స్వయంసహాయం" నేర్చుకోటానికి సహాయంగా ఉంటుందని ఉద్దేశించబడింది. ఇప్పటికే కరపత్రాలు చదువగల విద్య, విద్యాశాఖ, రైతుకు ప్రదానం చేయగల్గింది. ఈ పోస్టర్లలో ఒకదాంట్లో భారతప్రధాని ఒక రైతును వీపు తట్టుతున్న బొమ్మ కనబడుతుంది. ఒక పార్లమెంటుసభ్యుడు ఈ పోస్టరే ఎన్నికల ప్రచారానికికూడా మజాగా వాడవచ్చునని అభిప్రాయపడుతున్నాడు.

వ్యవసాయమంత్రాంగశాఖవారు ఈ వారం యూనియన్ పార్లమెంటులో, కేవలం ఒక లక్షన్నరరూపాయలుమాత్రమే రాజపుటానాలో నూతినీటి ప్రణాళికకు కేటాయించామని చెప్పారు. కేంద్రప్రభుత్వం క్రింద నూతులు తవ్వేపని ఇప్పటికే జరుగుతోందనీ, అందుకొక ప్రత్యేకశాఖఉందనీ, అభిప్రాయంలో ఉంది దేశం.

దీనితో అనేకసమస్యలు బయలుదేరుతాయి. "స్వయంసమృద్ధ" ప్రణాళిక ఉధృతిలో పత్తి, గోగునారకోసమని, ఆహారోత్పత్తి స్వయంసమృద్ధంచేయగల ప్రచారం కొంచెం మందగిస్తే, అధికాహారోత్పత్తి ప్రచారవ్యయం కొంత తగ్గవచ్చు. కేవలం ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజీకి పని కల్పించటానికే వ్యవసాయశాఖ పనిచేయటంలేదు. పన్ను చెల్లించేవారునిపట్లకూడా, ప్రభుత్వశాఖకు కొన్ని బాధ్యతలున్నాయి.

ఇండో - పాకిస్తాన్ ఘర్షణఫలితంగా, ఆహారస్వయంసమృద్ధిప్రణాళికలో కొన్ని మార్పులు జరిగాయనీ, 1951 తర్వాతకూడా ఆహారధాన్యాలు దిగుమతిచేసుకోవలసి ఉంటుందనీ, ఇప్పుడు అందరికీ తెలిసిపోయిన విషయమే తప్ప దాపరికం ఏమీలేదు. కాబట్టి, పత్తి, గోగునారస్వయం సమృద్ధం చేసేందుకు అదనపుఖర్చులు కావాల్సివస్తే, అధికాహారోత్పత్తిప్రచారానికి కేటాయించిన ఖర్చులోనించి తెచ్చుకోవాలి. దేశంఖర్చుమీద, ఆ వ్యవసాయశాఖ, మూడు కాళ్ల పరుగులు తీయటం కుదరదు.

తర్వాత; 1950 లో పత్తి గోగునార పంటలు స్వయంసమృద్ధం చేసికోటంలో ఆహారధాన్యాల ఉత్పత్తిలో కలిగే మార్పేదో, వ్యవసాయశాఖవారు అసందిగ్ధంగా తెలుపవలసిన విధాయకం ఉంది. అధికాహారోత్పత్తిప్రణాళికల వైఫల్యానికి వానలూ వంగుడులూ, కారణాలు చెప్పి, కర్షకుడు తిండిపోతయ్యాడని నిందించీ, సమర్థించుకోటం పరిపాటయిపోయింది. ఇకముందు ఇల్లాంటి అస్తవ్యస్తపు సమర్థింపులకు ఆస్కారం ఇయ్యకూడదు.

---

# నేటిప్రపంచం

(14-వ పేజీ తరువాయి)

కుండా ఇంతధనం దీనికిందే పెట్టుబడిపెట్టితే అమెరికాఆర్థికవ్యవస్థ ఏమవుతుంది? ఇప్పటికిప్పుడు ఏచిక్కూ రాకపోయినా ముస్ముందు పెద్దసమస్యలే సంభవించవచ్చును. అప్పుడు రష్యా ఏ యుద్ధమూ చెయ్యనవసరం ఉండదు. అమెరికా ఆర్థికవ్యవస్థ దానంతటదే కూలిపోతుంది. రష్యా కూడా హైడ్రోజన్ బాంబులు తయారుచెయ్యడానికి సంకల్పించినా ఇంతే. రష్యాలో ఆర్థికపరిస్థితి ఇంతటి ఖర్చుకి తట్టుకోలేదు. ఆవిధంగా ఏదేశంలో ముందుగా ఆర్థికవ్యవస్థ కూలి పోవస్తుందో, ఆదేశం ముందుగానే ఈ కాళశక్తిని శత్రువుమీద విడిచి వొదిలించుకోడానికి ప్రయత్నించవచ్చును. అంటే తయారైన బాంబులు ఆట్టే కాలం మూలుగుతూ కూర్చోలేవు. మూడో ప్రపంచయుద్ధాన్ని చేరువకు తీసుకువస్తాయి. ఈ సమస్యవిషయమై రష్యా అమెరికాలు పోటీచేస్తుంటే మిగతాదేశాలు చూస్తూ ఉండడం అసంభవం. ఏదోరీతిని ఈ మారణాయుధాల నిషేధానికి రష్యా అమెరికాల మధ్య సమాధానం కుదర్చడానికి ప్రయత్నాలు జరగవచ్చును. ఇటువంటి సమాధానం కుదర్చవలసిన అవసరం ఎంతైనా ఉందని ఐక్యరాజ్యసమితిఅధ్యక్షుడు జనరల్ కార్లోస్ రోములో అన్నాడు. ఏటం బాంబుల నిషేధానికి రష్యా చేసిన సూచనల్లో అంత అభ్యంతరకరమైన వేవీ లేవని ఇప్పటికి లండన్ 'టైమ్స్' పత్రికకి తెలిసివచ్చింది. క్రమంగా ఈ విషయమై యూరప్ దేశాల అభిప్రాయం అమెరికాకు అంత సుముఖంగా లేకుండా మారిపోయినా ఆశ్చర్యపడనవసరం ఉండదు.

[సూర్యనారాయణ]

---

# అజంతా కళావైభవం

[శ్రీ జి. కృష్ణ]



యశోధర

అజంతా గుహ 1.

అలనాటి కుంభపురంబుల్లో నగరిలో — నామాల......అక్కడున్నట్టుంది అజంతా. అజంతా గ్రామం చేరుకున్నాం, ఔరంగాబాదునుంచి బస్సుమీద. గ్రామం అవతల కొండ సమీపించాం. బస్సు ఆగలేదు — కొండను చీల్చుకు పరుగెత్తుతోంది. ఒక ప్రక్క కొండ — మరొక ప్రక్క అగాధం. పోగా పోగా ఒక జలపాతం కనపడింది. ఎల్లోరావద్ద ఆర్జించిన అనుభవాన్ని బట్టి అజంతా మహాకళాక్షేత్ర ప్రాంగణంకూడా ఆనివారి పాత జనిత తుషారాంచలాల్లోనే ఉండి శోభిస్తుందని మా విశ్వాసం. కాని కొండచరియలమీదుగా ఒక కొండవాగు ప్రక్కగా — బస్సు ఆగిపోయింది. రెండు కొండలమధ్యనుంచి వాగుకే వచ్చేదారి ఉంది. బస్సుకుపోయే దారి లేదు. అక్కడే అజంతాగుహలు.

వర్తులాకారంగా కలసిపోయిన ఆకొండల మధ్యకు — జలపాతంగా ప్రవేశించి, మధ్యరేఖగా ప్రవహిస్తోంది, వాగూరానది. కొండల మధ్యకు మాకే ఆనది అజంతా క్షేత్ర రామణీయకతకు ఒక అలంకారమయింది. అజంతాశిల్పులు ప్రకృతికి పోటీగా శిల్పసాధన ఉపక్రమించలేదు. వారి శిల్పసౌందర్యం గంభీరప్రకృతిలో లీనమైపోయింది.

శిల్పులెవరో తెలియదు — అజంతాసృష్టి ఏ మహాశిల్పి కాలంనాటిదో తెలియదు. అది కృష్ణ అనే రాష్ట్రకూటరాజు కాలము నాటిదట! కాబట్టి 'కృష్ణ' చాలా గొప్పవాడు శిల్పి కాకున్నా. దాదాపు రెండు వేలఏళ్ల తర్వాత, 1819 లో ఒక ఇంగ్లీషు సైనికాధికారి, ఈ గుహల్ని కనిపెట్టాడట. ఆపైన, చాలామంది కనిపెట్టారు! ఇందరి పేర్లూ అజంతా చరిత్రలో కెక్కిపోయాయి. శిల్పుల పేరులే లేవు! అయినా పెద్ద పెద్ద వాళ్లు వచ్చి, అజంతా గొప్పతనాన్ని అధికం చేస్తున్నారని కొందరి భావన!

మానవజీవనం, తన లోటుపాట్లన్నింటితో కళావాహినిలోకి ప్రవహించిన కాలం అది. జీవితలక్ష్య మెరుగని జీవులకు లలితకళల ద్వారా దివ్యపథాన్ని చూపిన దినాలవి. ఆక్షేపణ లేదు — అధిక్షేపణ లేదు — అనుమాన పరచాలనే ప్రయత్నం లేదు — "ఈ పనులను మానవులు చేస్తారు సామాన్యంగా — కాని ఇట్లా చేస్తే మంచిది" అనే సూచనే ప్రత్యక్షమవుతుంది. మతం, సంఘం, ధర్మం, అలంకారం, అన్నీ ఒకేచోట సంపూర్ణంగా, శిల్పచిత్రరూపంలో వివరింపబడటం ఒక్క అజంతాలోనే జరిగింది. రెండువేల ఏళ్ల క్రిందట ఏ నిర్మాణశాస్త్రపరిజ్ఞానంతో ఇట్లా కొండల్ని తొలిచి, ఈనాటికీ చెక్కుచెదరని మహోత్కృష్ట చిత్రాల్ని సృష్టించారో తెలియదు. తెలిసినా, ఆ ఒరవడిని అనుసరించ ప్రయత్నించటం సాధ్యం కాదు.

గుహలన్నీ బౌద్ధకళామందిరాలే — క్రీస్తుపూర్వం రెండవ శతాబ్దంనుంచి, క్రీస్తుశకం ఆరు — ఏడు — శతాబ్దాలమధ్య బౌద్ధమతం సాధించిన ధార్మికవిజయపరంపర, ఆది పంచి, పుష్పిస్తున్న ఆచారసంపద అన్నీ కలసి ఈ శిల్పాల్లోకి, చిత్రాల్లోకి చేరి ఉంటాయి. అజంతా ఒకనాటిది కాదు. మానవసంస్కారానికి కాలపురుషునికీ మధ్య తూగుటుయ్యాల అజంతా. బుద్ధుని అవతరణ చిత్రించిన ప్రథమగుహలో ప్రారం



తల్లీ, పిల్ల

అజంతా గుహ 17.



కలంకారి
అజంతా 1 గుహలో ఉపరిభాగ అలంకార చిత్రము.

...ంచి, ఇరువదిఅరవగుహల్లో ఉన్న నిర్వాణ బుద్ధునివరకు కళ్లు, మనస్సు తెరుచుకొని చూస్తే, ఒక జీవితప్రయాణం చేసినట్లే.

కళాచిత్రణ సూత్రప్రాయంగా ఉంటుంది. ఆనందంలోని ఆనందాన్ని, విషాదంలోని విషాదాన్ని కళ మాత్రమే బహిర్గతం చేయగలదు. ప్రకృతి-చిత్రంలో కావలసింది ప్రతికృతి కాదు. అందంగాని-వికారంగాని, తన్మయతగాని, ఆవేశంగాని ఏగుణమైనాసరే — అన్నీ శిల్పి అనుభవించిన తర్వాతనే పునఃసృష్టిని చెందుతాయి. అజంతాశిల్పుల అనుభవాలు అసంఖ్యాకం.

అజంతాకళాలక్ష్యం ధర్మజీవనాన్ని ప్రజాసామాన్యంలో పెంపొందింపచేయటం.

ప్రథమగుహయందు సిద్ధార్థుని శైశవం — అతడు విషాదపుష్పాల్ని చూచి విరాగి అవటం చెక్కబడి ఉన్నాయి. బుద్ధుడు తన పూర్వాశ్రమపు నివాసానికి ఒకసారి వస్తాడు. నివాసంలోనించి రాణీగారు భిక్షను పంపుతుంది. ఆమెకీ భిక్షుకుని గొంతు పరిచయమైనదే! కాని ముఖంచూస్తే, ప్రశాంతత తాండవిస్తూ ఉంటుంది. ఇది సుపరిచయ గృహమునే జ్ఞప్తి తెచ్చుకుపోయిందేమో! ఇట్టి, మహాజనకుడు తాను సన్యాసినైపోతానని భార్యకు చెప్తున్న దృశ్యం. ఇది విని, భర్తకోసం ఆమోదించటమే ధర్మంగా ఎంచే ఆ గృహిణీహృదయవ్యథ ఆమె ముఖంపై ప్రత్యక్షమవుతోంది. ప్రక్కనున్న ఒక పరిచారిక చేతిలోని పద్మం జారిపోతోంది. ఏదో తప్పిదంచేసిన ఒక నర్తకిని ఒక రాజు కత్తితో శిక్షింపబూనుకోగా, ఆమె శరీరం అప్పగించేస్తుంది. ఆ మెలితిరిగిన అంగములు, చలిస్తున్నట్టు కనపడే సన్నని చేతివ్రేళ్లు, క్షమాభిక్షను కోరుతున్నదని తెల్పే ఆముఖభంగిమం — ఓహో! ఏమి విషాదదృశ్యం! చేసిన తప్పిదాన్ని తెలుసుకున్న వ్యక్తికి పడేబాధను, చిత్రకారుడు ఊహించి, అనుభవించి, రచించాడు.

క్షాంతివాదిజాతకఘట్టం ఒకటి చిత్రింపబడింది. బ్రాహ్మణావతారంలో ఉన్న బోధిసత్త్వుడు, ధర్మప్రచారం చేస్తుంటే, వ్యతిరేకులు ఆయనను కొరడాలతో కొట్టి, కాళ్లు చేతులు చెవులు కోసెయ్యటానికి సిద్ధపడ్డో ఉంటారు. కాని ఆ బోధిసత్త్వుని మానసికవిని కాపాడుతున్న ప్రశాంతతను మాత్రం, అతని ముఖంనుంచి తొలగించియ్యలేకపోయారు బాధనుతవ్యతిరేకులు.

నాల్గవ గుహలో ఒక స్త్రీ చెట్టు నానుకొనిఉండగా, ఒక ఉడత చాలా మచ్చికతో, ప్రేమతో చెట్టుపై ఆమె సమీపంలో ఆడుకుంటోంది. ఆ స్త్రీ చక్కగా అలంకరించుకునే ఉన్నది. అందం అలంకారాలపైన మనసు పోయినంతమాత్రాన ధర్మగుణపరిపక్వత అసాధ్యం కాదని, చిత్రం చూస్తే తెలుస్తుంది. ఆ చిత్రార్థం వేరే ఏదో ఉన్నదేమో — కాని ధర్మచింతకు, అలంకారత్యాగం అవసరమని అభిప్రాయపడేవారికి ఈ చిత్రం ఒక పాఠం.

ఆరవగుహకు రెండు అంతస్థులు. పై అంతస్థుకు నాలుగు కిటికీలు, చక్కటి ప్రాంగణం — గృహానికావశ్యకాలైనవాన్ని పొందిన సన్యాసులు త్యజించలేదు. అందాన్ని వారు నిరసించలేదు! పదవగుహలో బుద్ధుడు, యశోధర, రాహులుడు ఒక గంధర్వుని వేశంలో చిత్రింపబడ్డారు. బుద్ధుని బొమ్మ చాలా ఒడ్డూ పొడుగ్గా ఉంది. యశోధర



చైత్యభవనాంతర్భాగము
అజంతా గుహ 19.



అలంకరణము

అజంతా గుహ 17.



మధుపాయి

అజంతా గుహ 1. గుహాలోకప్పు పై చిత్రము

దీనత, ఆనందం, భక్తి, ప్రేమ ఇన్నింటితో బుద్ధదేవుని చూస్తూ, రాహులుణ్ణి దీవించమని కోరుతుంది. "ఓ సిద్ధార్థా! రాహులుడు జన్మించిన వేళ, తాను రాజ్యాన్ని పరిత్యజించి, మౌనులై వెళ్లిపోయారు. నేడు వీనికి అంతకంటె మహోత్కృష్టరాజ్యం లభించింది!" అని యశోధర అనటం ఎంత భావగర్భితంగా ఉంది! రాహులుడు జన్మించినప్పుడు వెళ్లిపోయావు అని ఒక ఎత్తిపొడుపు - "మౌనులై" వెళ్లిపోవటం! తనతో మాట్లాడైనా మాట్లాడకుండా! అయినా భర్తకు పూర్తిగా తప్పల్ని అంటగట్టటాన్ని ఒప్పలేదు పాపం! అంతకంటె గౌతమునికి గొప్పరాజ్యం లభించింది అని తన్ను తాను ఊరడించుకుంటుంది ఆ సాధ్వి. రాహులుడు వింతగా చూస్తూ ఉంటాడు. ఆ శిశువు తన తండ్రేనని తెలుసునేమో! లేక తండ్రిని గౌరవించినట్లు, ప్రేమించినట్లు ప్రత్యక్షంగా ప్రవర్తించటానికి పెద్దవాళ్ళకోసం ఉన్నదనే బాధను కప్పిపెట్టుకోవటానికి అట్టి వింత మోమును చూస్తున్నాడేమో!

పదహారవ గుహలో జాతకకథలలో చాలా భాగం చిత్రించబడ్డాయి. కాని జాతకచిత్రాలన్నిటి కంటె పేరెన్నికగన్నది మరణశయ్యపై ఉన్న రాజకుమారి చిత్రం. ఆమె మోములో "ఇంక మిమ్మల్నందర్నీ విడిచి పోతున్నాను" అని సెలవు తీసుకొనటమే కనపడుతుంది. కళ్లు ప్రపంచాన్ని చూపటమే గాక, మానవహృదయంలో మసలుచున్న భావప్రపంచాన్ని ఈ ప్రపంచానికి ప్రదర్శించగలవు. ఆ రాకుమారిమరణవేదనంతా ఆమెకళ్లలోనే ఉన్నట్లు చిత్రకారుని భావన. అయితే, ఆ కళ్లను చిత్రం నుంచి చెరిపివేశామా? వీల్లేదు. కళాకారునికి కనులచిత్రణలో గల నైపుణ్యాన్ని చాటటానికే ఆచిత్రం ఏర్పడ్డట్టుంది. ఆ చిత్రానికి అక్కడే ప్రధానం. చిత్రగాంభీర్యత, రాకుమారిప్రక్కన ఒక అమాయికబాలికను చిత్రించటంతో శతధా ఇనుమడించింది. ఆ బాలికకు, రాకుమారికనులలోని బాధే గాని, తద్భావానివృత్తిచేయుటకై కొద్దినేర్పులో రాబోవు మృత్యువుయొక్క పటిమ తెలియదు. రాకుమారికళ్లలోని ఆవేదనకంటె, బాలికకళ్లలోని అమాయకత్వం, చాలా విషాదం కలుగజేస్తుంది. చిత్రకారుడు ఆ వేదనను, అమాయకత్వాన్ని పోల్చి చూపెడుతున్నాడేమో! అదే నిజమవుతే అట్టి పోలికను పూర్ణంగా చూపెట్టగలిగాడనాలి. చూసి, తెలుసుకోగలిగినవాడికి - ఆపిల్ల నెత్తుకొని, "నీ వింక నిశ్చింతగా మరణించు తల్లీ - నే నీపిల్లను పెంచుతానుతే - నీ వలెనే ప్రేమించుతాను" అని రాకుమారిని అంపకాలు చేసి, ఆమెను ఆ యాతన నుంచి విడుదలచేయవచ్చు. అట్టి ప్రేమ భావనను కల్గించటమే ఆచిత్రలక్ష్యం.

'గౌతముని కనేముందు, శుద్ధోదనుని రాణి మాయాదేవి ఒకకల కన్నది; ఆరుదంతాలు కల ఏనుగ ఆమెలో ప్రవేశించినట్లు. అప్పటికే బోధిసత్వుడు తన జన్మభూమిని నిర్ణయించుకున్నాడు. మాయాదేవికి జన్మించిన ఈ శిశువుకు ఇంద్రుడు గొడుగుపడుతున్నాడు. బోధిసత్వుడు అంత నలుదిక్కులకు తిరిగి, సూత్రప్రాయంగా తన భవిష్యత్కార్యక్రమాన్ని వివరిస్తాడు. తూర్పుకు తిరిగి, "నేను మహానిర్వాణౌన్నత్యానికి చేరతాను" అని - దక్షిణానికి తిరిగి, "నేను జీవులలో కెల్ల ప్రథముడ నౌతాను" అని - పశ్చిమానికి తిరిగి, "ఇది నా చరమజన్మము" అని

ఉత్తరానికి తిరిగి "జీవితపారావారాన్ని అధిగమించుతాను"అని అంటాడు.

కాని బోధిసత్వుడు వివిధరూపాల్లో, మానవులకు ఎట్లా గుణబోధ చేస్తాడో, ఈ గుహాలో చిత్రింపబడిన వివిధజాతకకథల ద్వారా తెలుస్తుంది. ఒక రాజు ఒక లేడిని వెంటాడుతాడు. అది దొరకదు. కాని రాజు మాత్రం ఆ వెంటాడటంలో ఒక గోతిలో పడ్తాడు. అప్పుడా లేడి బోధిసత్వుని అవతారం - రాజును రక్షిస్తుంది. అట్లాగే బోధిసత్వాంశగల ఒక ఏనుగ, తన గుడ్డితల్లిని రక్షించుకుంటూ జీవిస్తోంది. ఒక వేటగాడిని ఒక సందర్భంలో ఆ ఏనుగ రక్షిస్తుంది. వేటగాడు ఆ మేలును మరచి, ఏనుగను ఒక రాజుకు పట్టిస్తాడు. రాజు, ఏనుగకు చాలా మర్యాద చేస్తాడు - అలంకారాలకు ఆహారానికి కొదువ ఉండదు. కాని ఏనుగకు కావలసింది అమ్మ. అమ్మ-గుడ్డిది-ఏం బాధ పడ్తోందో అనే బాధపడ్తున్న ఏనుగకు రాజగౌరవ మెందుకు? సత్యాగ్రహం చేస్తుంది. రాజు లొంగివచ్చి, ఏనుగను విడుదల చేస్తాడు - అది 'అమ్మ'దగ్గరకు పరుగెత్తుతుంది. అట్లే పూర్వజన్మజ్ఞానము కించిత్తు గల ఒక రాణి, తన పూర్వజన్మపు భర్త పెట్టిన కొన్ని కష్టాల్ని తల్చుకొని, ఏనుగ రూపంలో ఉన్న ఆ భర్తపై ఎట్లాగైనా కసి తీర్చుకోటానికి పూనుకుంటుంది. ఆ ఏనుగదంతాలను పెరికితెమ్మని సేవకుల్ని పంపుతుంది. కాని ఆ ఏనుగ బోధిసత్వాంశ గలది. తనేవచ్చి, దంతాలను పెరికి ఇస్తుంది. క్షణికకోపంతో, ఎంత దారుణ చర్యకు పాల్పడ్డా, ఆ ఏనుగతో తను ఒక జీవితాన్ని గడిపినదికదా - అతడు పెట్టిన కష్టాలేగాని, ఇచ్చిన సుఖాలేగాని జ్ఞప్తికి రాకుండా ఉండగలవా? [పూర్వజన్మ] భర్తను కష్టపెట్టానే అని రాణిగారు మూర్ఛపోతారు.

ఈ విధంగా మానవునిలోని బలహీనతలను సరిదిద్దటానికి, మానవహృదయాల్లో ధర్మబీజావాపన చేయటానికి బోధిసత్వుడు వివిధజీవావతారాలను దాల్చి, క్షమను, ప్రేమను, సేవాతత్పరతను ఉపదేశించాడు.

మానవప్రకృతి తలపెట్టగల, సాగింపగల తప్పిదాల్ని అనేకవిధాలుగా బౌద్ధకళావేత్తలు చిత్రించారు. అవధానుడనే రాజు సముద్రప్రయాణం చేస్తుండగా, నౌక దెబ్బతిని ఒక రాక్షసభూమికి చేరుతాడు. అక్కడ ఒక రాక్షసిచేత ప్రేమింపబడి, పైశాచిక జీవనమే గడుపుతూ ఉంటాడు. కాని ఏనాటిదో - ఒక మానవభావం హృదయంలో మెసుల్తూనే ఉంటుంది అతగాడికి. బలాహ అనే ఒక మాయగుర్రానెక్కి ఇంటికి రహస్యంగా ప్రయాణమౌతాడు. కాని రాక్షసి వదుల్తేనా! దుస్సాంగత్యం లాగా పట్టుకుంటే వదలని ఈ పిశాచం, ఏకాంతనం పోతుందనే బాధైనా లేకుండా, భర్తను కైంకర్యం చేసేస్తుంది. చిత్రమే ప్రధానంగా గలవారికి, ఇదో చక్కటి బొమ్మలకథ. వాస్తవానికి అన్నీ అంతే. రుములను ఇంకా కొంచెం ఉత్కృష్టంగా చేసుకోగలవారికి అంజంతామనోనేత్రాన్ని ప్రసాదిస్తుంది.

భోగమే జీవితపరమావధిగా దినరాత్రాలను యౌవనోద్వేగంతో గడిపివేస్తున్న సుందరి, నందులు, ఈ గుహాలో కానవస్తారు. బుద్ధుడు వారికి "శోకమోహాభయసంభ్రాంతమైన సంసారవిస్తారారణ్యంలో సుఖంబెటుల లభ్యంబౌ దేహికిన్" అని గొప్ప సందేహాన్ని కల్గిస్తాడు. "కడుపు చుమ్మలు చుట్టగా నడలుచున్న తల్లులం గాంచవో తమ్ముడా" అని ప్రజాక్షేమానికి



గుహాలోవసారాలో పైకప్పున చిత్రాలు.
అజంతా గుహ 17.



గుహాముఖశిల్పము.
అజంతా గుహ 19.

బాధ్యత వహించాల్సిన ఈ రాచబిడ్డనికి (నందునికి) కళ్లు తెరుస్తాడు.

చివరకు ఇరువదిఆరవగుహాలోని నిర్వాణ బుద్ధుని విగ్రహం. ఎల్లోరావలె, ఇచట కూడా శిల్పం చాలా ఉంది. అనేక గుహల్లో బుద్ధవిగ్రహా లున్నాయి. దాదాపు ప్రతిగుహాలోనూ శిల్పం, చిత్రం - రెండూ మంచిమోతాదుగా ఉన్నా యనవచ్చు. నిర్వాణబుద్ధుడు చాలా పెద్ద విగ్రహం. దక్షిణదేశంలో ఉండే గోవిందరాజస్వాములు, వీరరాఘవస్వాములు, వెంకటేశ్వరస్వాములు - మొదలైనవాటికంటె చాలా పెద్దది. అలంకారం లేకున్నా గాంభీర్యతకు లోటులేదు - ప్రశాంతతను ప్రసారిస్తున్నట్లుంటుంది.

ఇవి తాత్విక లేక ధార్మిక చింతగలవారికే రుచిస్తాయి. కేవలం అందమే ప్రధానమైన వారికి అజంతాకళాలోకంలో కనపడే ఆకృతులు అనేకం. ఎవరైనప్పటికీ, మానవత్వంమీద నమ్మకంగాని, మనస్సు గాని లేనివారికి అజంతా, శిల్పకుడు - శిలామయం.

ఒక గుహాలో ఒక నల్లటి రాకుమారిని సృష్టించారు. నలుపుకు మెరుగెక్కించారు. స్త్రీలు స్నానానికి వెళ్ళటం, అలంకారం చేసుకోటం వివరంగా చూపెట్టారు. కొందరు ఛాందసులు, 'ఫోకులు' అని అసహ్యించుకుంటున్నట్లు (మహా)నటించే, అనేక శృంగారాలు, ఆనాడే ఉన్నట్లు అజంతా చిత్రాల్లో కనపడుతుంది. అప్సరసలకు తల గుడ్డల్ని కట్టటం [నేడు పాశ్చాత్యస్త్రీలు తలకు గుడ్డకడ్తుంటే, మనవాళ్లు తెల్లబోతారు. పైగా అది మన సాంప్రదాయం కాద టారు] - పెదవులకు ఎర్రరంగు పూసుకొనటం, సంచిని పుచ్చుకొని తిరగటం - రకరకాలచీరెల్ని ధరించి, అలంకారం చేసుకోటం ఆనాడు సంసారులకు కూడా తప్పుగా కనపడలేదల్లే ఉంది! వారు కట్టిన చీరెలు - ఇంకా అజంతాలో లభించే అనేక ఇతరచిత్రాల్ని, చీరలకు రైకగుడ్డలకు, అంచులుగా, అలంకారాలుగా ఉపయోగించుకోవచ్చు. ఆనాటి కుర్చీలకు మించి నేటి కుర్చీలలో అధికృత ఏమీ లేదు. ఆనాటి పురుషులు చారల చొక్కాలు - నిక్కర్లు ధరించారు. బెల్టులు పెట్టుకున్నారు. రంగు రంగుల మేజోళ్ళను ధరించారు. చక్కటి చెప్పులు వేసుకున్నారు. చక్కగా అలంకరింపబడిన గుర్రాలపై - జీను, కళ్లెం అన్నీ ఈనాడు ఉన్నట్లే - ప్రయాణం చేశారు. వేటాడారు.

ఒకటవగుహాలో ఎద్దుల పోట్లాట చిత్రింపబడ్డది. రెండవగుహాలో, ముష్టియుద్ధాన్ని నేర్పుతున్నాడొకడు. పదిహేడవగుహాలో చక్కటి వేటదృశ్యం ఉంది. మొదటిగుహాలో విదేశీయులు (పర్షియనులు) త్రాగుతూ, మజా చేస్తున్నట్లు చిత్రింపబడింది. అజంతాలోని చాలాచిత్రాల్ని — ఈ మనిషి ఉత్తరాదివాడు - ఇతడు ఫలానా దేశస్థుడు, అని చెప్పవచ్చు. హోదాలను కూడా అలంకారాల్ని బట్టి చెప్పవచ్చు. చూసేవారికి, ఇతడు రాజు అని, ఇతడు సేవకుడు అనీ, ఎవ్వరూ చెప్పక్కర్లేదు.

అజంతాలో మరచిపోరానిది ప్రకృతి చిత్రణ. బ్రహ్మకు కవలసోదరుడొకడుండి, అజంతాలో, కళోద్రేకంతో మరొక ప్రకృతిని సృష్టించినట్లుంటుంది. ప్రతి ఆకు, ప్రతి రెమ్మ, ప్రతికొంప, ప్రతి వాహిని కూడా మిగిలిన అంశములకు తుల్యమైన పరిమాణంలో చిత్రకారుని శ్రద్ధను స్వీకరించాయి. బుద్ధదేవుణ్ణి వేయటానికి తీసికొన్న శ్రద్ధనే, పక్షిని వేయటంలో, పల్లవాన్ని వేయటంలో కూడా ప్రదర్శించారు.

అజ్ఞానంచేత అనేకులు కొన్ని అజంతాచిత్రాల్ని చెక్కేశారు - చెరిపేశారు. కాని ఆనాడు శిల్పులు చూపిన శ్రద్ధామహత్వమే, గుహల నీనాటికీ, కొంత శిల్ప, చిత్ర శేషంతో ఉంచింది.

అజంతాలో స్త్రీకి గల ప్రాముఖ్యత చాలా ఉదాత్తమైనది. అజంతా స్త్రీ, కళను పెనవైచుకున్నది. అలెగ్జాండర్ పోప్ కాలంలో బుద్ధిహీనుడై జన్మించటమే అదృష్టం! అట్లాగే, అజంతా శిల్ప నిర్మాణకాలంలో స్త్రీయై పుట్టటం చాలా అదృష్టం! స్త్రీ ఏమి చేసినా కళయే. ఆమె చేత అశిల్పం-మాటయే సంగీతం - కదలికయే నాట్యం. ఏ స్త్రీకూడా అందవికారంగా ఉండదు - ఆమె అలంకరించుకొనటంలో, ప్రవర్తించటంలో గల భేదాల్నే అందం అని అందవికారం అని పురుషులు అంటూ ఉంటారని రసికుని భావన. అసలు ఏ కళాబ్రహ్మ కూడా, స్త్రీని సృష్టించటంలో ఇంత శ్రద్ధనూ, మధురసంకల్పాన్ని చూపలేదు. ఆమెకు నగలలోపం లేదు-దుస్తులలోపం అలంకారాన్ని అతిశయింపచేయటానికే తోడ్పడింది. నృత్యగీతవాద్యాల్లో ఆమె తన జీవితాన్ని ఒక ఉదాత్తదివ్యాంశగా చేసుకుంది. అదే పురుషునికి హాయి నిచ్చింది. దివ్యులు, మానవుల ధార్మికసాధనకు సంతసించి, స్త్రీలను (అప్సరసల్ని) పంపించారు. భగవానునికి పద్మాల్ని సమర్పించు పూజారిణి స్త్రీయే. మానవుడు ఈలోకాన్ని మరచిపోవటానికి స్త్రీసమక్షమే కావాలి. స్త్రీ నృత్యం చేస్తేనే బాగుంటుంది, లేక స్త్రీతోపాటు పురుషుడు నృత్యంచేస్తాడు. చివరకు అజంతాకళావేత్తలు, స్త్రీలకు చిత్రలేఖనాన్ని నేర్పి ఆనందించారు.

---



'విశ్వాంతర' జాతక కథ

అజంతా గుహ 17.



# తాళ్ళపాకవారి పదములు

## శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

౪౪

(సంపు. 3 : పదం. 303)

అన్నమయ్యగారి రచన

కాంభోజిరాగం - త్ర్యశ్ర త్రిపుటతాళం

[రాగలక్షణం]

తెలుగువారికి చాలా ప్రియమైనరాగం. గిరికాదేవి విరహవేదనవిలాపంలో ఈ రాగపు మార్దవదైన్యాదిభావములను కనుగొన్నాడు రామరాజభూషణుడు. కవిచౌడప్ప దీని 'గాంభీర్య' మునకు మరులుగొని ఇంతటి దింకొకటి లేదన్నాడు! కర్ణాటకగాయకులందరూ దీన్ని గ్రహించి పెంచినారుగాని తెలుగువారిదే ఒక విశిష్టపద్ధతి ఈ రాగంలో ఉన్నట్టుంది. తాళ్లపాకవారి పదాలలో ఇప్పటికి 'తెలుగుకాంభోజి' రాగంలో రెండు బైలుపడినవి. అచ్చపు తెలుగుజాతివారగు ఎరుకలవారు దీనిని ప్రత్యేకంగా అనుగ్రహింపగా 'ఎరుకలకాంబోది' సిద్ధమైనది. తెలుగుకాంభోజి అదే కాబోలు. 'ఎరుకల' అర్థం తెలియక అనాంధ్రులు దీన్ని 'యదుకుల' గా సంస్కరించుకొన్నారు. ఇప్పుడదే పేరు దానికి నిలిచింది. హిందూస్తానీవారి 'తిలక్ కామోద్' రాగం దాని వేషాంతరమే— నామరూపాలలో.

మతంగుడు 'బృహద్దేశి'లో దీన్ని లక్షించినాడు. (పు. ౧౧౭) పాల్కురికి సోమన రాగపట్టికలో ఇది కలదు. (బస. పు; పు. ౯౦) పార్శ్వదేవుడు 'సంగీతసమయసారం' లో దీనినిస్మరించినాడు. రామామాత్యుని లక్షణంలో దీని స్వరూపం కొంత స్పష్టపడింది. అతని మతంలో ఇదొకమేళరాగం: పంచశ్రుతిరిషభ ధైవతములు, అంతరగాంధార కాకలీనిషాదములు, శుద్ధ స-మ-ప స్వరాలు గలది. (మేళ ప్ర. ౬౨) మధ్యమ నిషాదస్వరాలు ఆరోహణంలో వర్జ్యములు. (రాగ ప్ర. ౪౫) అనగా 'స రి గ మ ప ధ స - స ని ధ ప మ గ రి స' అని సంచారం. ఐతే ఇది ఇప్పటిబిలహరిరాగమౌతుంది. ఇవే స్వరాలుగల ఈ మేళమే పేర్కొని సోమనాథుడు నిషాదం మాత్రం వికల్పంగా వర్జించవచ్చునన్నాడు. (స్వర మే; వివే. ౪; ప. 3౪) కాని అత డిచ్చిన లక్ష్యంలో (వివే. ఖ; ప. ౧౦౦) నిషాదం పూర్తిగా వదలినదే కాక, 'రి మ గ రి' అనే సంచారమే చూపినాడు! రామమాత్యుమీదిని కసిదీర్చుకొనవలెననే గ్రంథం వ్రాసినట్టుండే వేంకటమఖి ఈ సందర్భాన్ని పురస్కరించుకొని అతనిని చెడదిట్టినాడు.

'కాంభోజీరాగమేలస్య కైశిక్యాఖ్యనిషాదకః
ఇతి నో వేత్తి కిం వీణావాదినాం గృహదాస్యపి' (చ. ప్ర; రా. ప్ర; ప. ౨౦౮.)

'కనుక గీతజ్ఞులు నీకు బహిష్కారం వేయవలసిం' దన్నాడు! అదిమొదలు నేటిదాకా ఈ రాగంలో కైశికినిషాదమే రాజ్యం చేస్తూ ఉంది. 'స ని పా' అనే ప్రయోగంలో నిన్నమొన్నటిదాకా స్పష్టంగా వినవస్తూవుండిన ఆయింత కాకలినిషాదంకూడా వేంకటమఖిగారి మేళశాస్త్రపు దెబ్బకు అంతర్ధానమై పోయింది.

నిజంచూడబోతే ఇందలి నిషాదం కైశికీ కాదు, కాకలీ కాదు. ఆ స్వరం ఈ రాగంలో ఆరోహణంలో వర్జ్యమై అవరోహణంలో కేవలం అనువాదిగామాత్రం మొగం చూపుతుంది గనుక దానికి నిలుకడ లేదు. ధ ని దా - అనే ప్రయోగంలో కైశికికి తక్కువగానూ, స ని పా—అన్నప్పుడు కాకలికి ఎక్కువగానూ పలుకును. స నీ ధా—అన్నప్పుడు నిషాదం ప్రాయికంగా సాంధ అనే జారును. అవరోహణం స ధ ప - స ధా ప మ గ రి సా అన్నా రాగం చెడదు.

నిషాదం వలె దీని మధ్యమస్వరంగూడా చాలా శ్రద్ధతో గమనింపదగినది. దానివలె ఇదికూడా ఆరోహణంలో లేదన్నారు ప్రాచీనులు. నిషాదం షడ్జానికో ధైవతానికో అంటుకొనే నడిచినట్లు, మధ్యమం గాంధారాన్నో పంచమాన్నో ఆశ్రయించే తోచును. గ మా అన్నప్పుడు కొంచెం తక్కువగానూ, గ మా అన్నప్పుడు పంచమనాదరేఖను కడపటి చుక్కగా గ పామ అన్నట్టు గానూ పలుకుతుంది. కనుకనే మ గ పా ధా, స రి గ పా,మ పా, అనే మధ్యమలంఘనప్రయోగం దీని జీవాతువైనది. శుద్ధంగా షడ్జంతో సంవాదంగల మధ్యమాన్ని ఎక్కువగా వాడితే ఈరాగంస్వరూపం చెడుతుంది. రిషభంకూడా దీనివలె స్థిరస్వరూపం లేని అనువాది స్వరమే. కనకనే మ గ సా, రి గ సా - ఇత్యాది ప్రయోగాలు. స రీ అనే ప్రయోగం స సా, గ రి అనే స్ఫురించును. పంచమ గాంధార ధైవతాలు జీవస్వరాలు.

[పల్లవి]

(౧) , ప ధ స ని ధా ని ధ పా | ప ధ మా గా పా ధా | , స ని పా ధా సా | , , , ని ధ ప ధ |
ఏ ల రా డ మ్మా ఇం తి గో వా

(౨) మ ప ధ ప ధ రి స ని ధ ధ ని పా ప ధ ప ధ మ గ పా పా స ధ | , రి స ని ప పా ధా సా | , , ,
డే ల రా డ మ్మా ఇం తి గో
స రి ని ధా ప ధ |
వా

(3) , మ పా ధా గా మ గ రి స ని ధ పా | ప ధ పా ధ ని ధా , మ పా పా స ధ | , రి స ని ప ధా మ గ రి సా , |
డే ల రా డ మ్మా ఇం తి గో

(౪) , , పా , ధ గ మ గా రి గ రీ స రి సా ని ధ | ధ ప మ గ స రి గ పా మ పా స ధ , , , ,
డే ల రా డ మ్మా

(౧) , పా , ధ ధ స ధ ప మ ప మ గ | సా , రి మ గ సా , స ని | పా , ధా , స రి గా | గ సా ధ పా , , మా
డే ల రా డ మ్మా న న్నే లి న వా డు

(౨) , పా , ధ దా ని ధ పా ధ ప మ గా స | స రి గా మ గ రి గ సా , స ని | ప ధ స రి గ స
డే ల రా డు మ్మా న న్నే
స రి గ మ ప ధ ని ధ | మ గ ప ధ స రి గ మ గా రి గ రీ స స ని ధ ‖ ప మ (ఏల)
లి న వా డు

[చరణం]

, , ధ పా మ ప మ గ | రీ గ మ గ రి సా , రి గా | , స రి గ మ గా గ రి మ గ సా స స ని ధ ప ధ
ప చ్చ ని పు లు గు ల బం డి మీ ద నుం డు

, , రి సా రి స ని ప | ధ సా ధా , సా , రి మ గ రి స | రి గ సా గ రి గా ప మ పా ని ధ | ధ ప మ గ రి స రి గా , సా
ప చ్చ విం టి పి న్న బా లు ని తం డ్రి

, , ప పా స ధ ధా | రి స సా ని ప ధ స రి | , రి ధా స రి గ మ గ సా | రి స నీ ధా ధ ని పా , |
ప చ్చ ని చా య ల బా య ని బం గా

ధ ప ప మ పా ధ స రి గ సా | సా ధ రి స నీ ధా ధ ప మా | , పా ధ స ధా ధ ని పా |
రు ప చ్చ డ ము ను గ ట్టి బా గై న
మ ప మ గా స సా , రి గ మ పా ‖ , మ (డేలరా)
వా

ఇట్లే క్రిందిచరణములు :

(౨) తెల్లని పులుగువై - తిరుగ మరిగినట్టి
తెల్లని సతిపాలి - దేవరతండ్రి,
తెల్లని పాముపై - తేలి పొరలువట్టు
తెల్లనికన్నుల - తేలినైనవాడు. (ఏల)

(౩) కొండవింటివాని - కుత్తుకొనినయట్టి
కొండుకప్రాయపు - గూతురుతండ్రి,
కొండలరాయడు - కోనేటితిమ్మయ్య
కొండతలనెత్తి - గుఱుతైనవాడు. (ఏల)

**లఘుటీక :** ఈ పదంలో శ్రీ వెంకటేశ్వరుడు సంపత్తు, సంతానము, సామర్థ్యముగల గృహస్థుగా ప్రశస్తుడైనాడు.

పచ్చనిపులుగులవంటి = చిలుక తేరు ; పచ్చవింటి = చెఱకు విల్లుగాగల ; తెల్లనిపులుగు = హంస ; తెల్లనిసతిపాలిదేవర = సరస్వతి భర్త - బ్రహ్మ ; తెల్లనిపాము = ఆదిశేషశయ్య ; కొండవింటివాని = శివునిని ; కుత్తుకొనిన = స్వాధీనపరుచుకొన్న ; కొండుకప్రాయపుగూతురు = ఎలప్రాయపుకన్నె - గంగ. ఆమె శివుని నెత్తిన గూర్చున్నది. భూలోకగంగగా, పాతాళగంగగా వెనుకవచ్చుచున్నవే శివుని తలకెక్కినది గనుక కొండుకప్రాయము. ఆమెకు తండ్రి. విష్ణుపాదోద్భవగదా గంగ ; కొండతలనెత్తి = గోవర్ధనపర్వతమును తల మీదికెత్తి ; గుఱుతైన = కీర్తిమంతుడైన ; తిమ్మయ్య = తిరుమలయ్య.

**ముద్రితపాఠములు :** పచ్చలింటకన్న ; పచ్చనాముగట్టిన ; తెల్లనిపులుగులై ; కొండలింటివాని.



ఇండోనీషియా అధ్యక్షుడు డా. సోకర్నో క్రిందటి నెల ఢిల్లీనుండి వెళ్లటానికి ముందు పాలెం విమానాశ్రయంలో తీయబడిన చిత్రం. ఎడమనుండి కుడికి డా. రాజేంద్రప్రసాద్, డా. సోకర్నో, సర్దార్ పటేల్, శ్రీమతి సోకర్నో, నెహ్రూ, రాజకుమారి అమృతకౌర్.




# బాలరాజు

ఆంధ్రసామ్రాజ్యాన్ని ఉద్ధరించి, ఆంధ్రప్రతిభను నలుదిశలా చాటగలిగిన వీరశిఖామణులలో బాలరాజొకడు. విభిన్నాంధ్రలోకాన్ని ఉచ్చస్థితికి తెచ్చిన అశోకునితర్వాత బాలవీరుడు శాతవాహనుడే గణనీయుడు. ఇట్టి వీరపుత్రుల కాటపట్టయిన భారతావనిలో జన్మించినందులకు మన మెంతో గర్వించాలి.

రెండువశతాబ్దంనాటి సంగతి.



విశాలాంధ్రాన్ని ద్వీపకర్ణుడనే మహారాజు పరిపాలిస్తూండేవాడు. మహావైభవోపేతంగా ఎంతో శోభాకరంగా ఉండేది ఆరాజు పరిపాలన. సర్వకళలకూ ఆటపట్టయి సస్యశ్యామలంగా ఉండేది ఆనాటి ఆంధ్రం. సరస్వతీపీఠమై వెలసింది ఆరాజు ఆస్థానం.

ద్వీపకర్ణునికి అన్నివిధాల సుఖానికీ, సంతోషానికీ లోటు లేకపోయినా మనశ్శాంతిమాత్రం ఉండేదికాదు. తనకు పిల్లలు లేకపోవడంచేత యెప్పుడూ దిగులుగా ఉండేవాడు. తనతో తన వంశం అంతరించిపోతుందేమో నని అనేక విధాల విచారించేవాడు. దైవానికి తనపై అనుగ్రహం కల్గనందుకు తన దురదృష్టాన్ని నిందించుకునేవాడు.

అలా ఉంటూండగా దైవమే కాదు ప్రకృతికూడా ఇతనిపై వైరం వహించింది. నాగసర్పంచేత కరవబడి మృత్యువాత బడింది, ఆ మహారాణి. సతీవియోగం మఱింత

**శ్రీ చెరుకుమిల్లి భాస్కరరావు**

క్రుంగదీసింది రాజును. భగవంతుణ్ణి అనేకవిధాల ప్రార్థించేవాడు; అనేక మ్రొక్కులు మ్రొక్కేవాడు ఎప్పటికైనా దయ కలుగుతుందేమో నని. చివరకు జీవితంమీద నిరాశ జనించింది రాజుకి. తన కున్నదంతా దానధర్మాలకీ, పుణ్యకార్యాలకీ వినియోగించ దలిచాడు.

కరుణామయునికి కటాక్షం కలిగిందొకనాటికి. ఒక వృద్ధబ్రాహ్మణుని రూపంతో ద్వీపకర్ణుని వద్దకు వచ్చాడు. ద్వీపకర్ణు డా బ్రాహ్మణునికి అర్ఘ్యపాద్యములు సమర్పించి అంజలి మోడ్చి నమస్కరించాడు. అందుల కా బ్రాహ్మణుడు ఆ రాజును "సుపుత్రప్రాప్తి రస్తు" అని దీవించాడు.

రాజు విభ్రాంతు డయ్యాడు. సతీరహితుడైన ఆరా జీమాటల నెలా విశ్వసించగల్గుతాడు? కుమారుడు కలిగినకదా కులము నుద్ధరించడం! భార్యయే లేని తనకు పుత్రు డెట్లు కల్గును? ఇందలి మాయను తెలియలేక ఆ బ్రాహ్మణునికి తన వృత్తాంత మెఱిగించి సుపుత్రుడు ప్రాప్తించు టెట్లని ఆరా జడిగేడు.

అందులకు ఆ ముసలిబాపనయ్య "ఓ రాజా! అనుమానపడకు. బ్రాహ్మణ వాక్కు వమ్ముకానేరదు. నా ఆశీస్సు ఫలించకపోదు. ఇది భగవదాజ్ఞ. ఉదయముననే వేటకు వెళ్ళి సుఖంగా సంతోషంగా విహరించిరా" అని రాజును సమాధానపఱిచాడు. అంతర్ధానమయ్యాడు.

ద్వీపకర్ణుని కిదంతా ఒక మాయలాగా, స్వప్నంలాగా ఉంది. బ్రాహ్మణవాక్కులోని అంతరార్థం తెలుసుకోవాలనే అసక్తి ఎక్కువైంది రాజుకి. భగవత్ప్రేరితుడై మరునాటి ఉదయమే వేటకు బయల్దేరాడు.

చాలసేపు వేటాడి అలసిన రాజు ఆపరిసరమందలి తటాకంలోని నీళ్ళు త్రాగి ఆ ఒడ్డునే ఉన్న వృక్ష

చెట్టునీడను విశ్రమించాడు. బ్రాహ్మణుని ఆశీస్సునుగుఱించి ఆలోచిస్తూండగా సింహము పైన స్వారీచేస్తూ ఒక బాలుడు ఇతని కంట పడ్డాడు. రాజుఆశ్చర్యానికి మేఱ లేదు. ఆ బాలుని ధైర్యసాహసాలకి రాజు అనేకవిధాల మెచ్చుకున్నాడు. అతని వృత్తాంతం తెలుసుకోవాలని బుద్ధిపుట్టింది.

సింహాన్ని చంపితే బాలుడు దొరుకుతాడని ఆరాజు సింహంమీదకి ఒక వాడిబాణం వేశాడు. వెంటనే ఆ సింహం మానవాకృతిని పొంది రాజుతో సంభాషించింది. రాజు మఱింత ఆశ్చర్యాన్ని పొంది ఆ సింహంపూర్వగాథను తెలుసుకోదలిచాడు. అందుల కాసింహం: "ఓ రాజా! నేను ఎవరో తెలిసికోవలసిన ఆసక్తి నీకుంటే నాకథ విను. నేను యక్షుడను. కుబేరుని కూరిమి సఖుడను. ఒకనాడు మేమిద్దరం అంతరిక్షంలో విహరిస్తూ కృష్ణవేణి నీలజలాల సొంపుకు క్రిందకు దిగి వచ్చాం. అక్కడ కొంతసేపు కాలం గడిపాం. ఆచెంతనే నడయాడే ఒక మునిపత్నిని చూసి నేనామెను మోహించాను. గృహోన్ముఖుల మయ్యేసమయమైనా నేను కదలక పోవడం చూసి కుబేరుడు వెళ్ళిపోయాడు. నేను నా మాయోపాయంచేత మునిపత్నిని చిక్కించుకుని ఆమెతో నాప్రణయం నడిపేను. ఇంతలోనే ఆమెభర్త అక్కడకు వచ్చి మా ఇద్దరినీ సింహాలు కండని శపించాడు. అప్పట్నించీ నే నీసింహంరూపులోనే ఉండి నేడు నీపుణ్యమాయని శాపవిముక్తుడ నయ్యాను. ఈ పసివాడు మా అనురాగఫలం. వీనిని నీవెంట గొనిపోయి పట్టముకట్టుకో. నీ కీర్తిని, నీ వంశపు ప్రతిభను దశదిశలా చాటగలడు." అని చెప్పి అంతర్ధాన మైంది.

రాజు బ్రాహ్మణవాక్కులోని సత్యాన్ని తెలుసుకుని, తన ఆశయం నెరవేరినందుకు ఆనందాన్ని పొందేడు. ఆ బాలుని వద్దకు వెళ్ళి అతనిని తన రాజధానికి రమ్మని ఆహ్వానించేడు. కాని ఆ బాలుడు తనను కన్నవారికంటె నెక్కుడుగా పెంచిన కుమ్మరులకు చెప్పకుండా రానన్నాడు. బలమున పాలు త్రాగించడంకంటె నయమున విషం త్రాగించడం సులభమని ఎఱిగి ఆరాజు తన రాజధానినుంచి కొన్నికోట్ల విలువగల ధనరాసులు తెప్పించి వాటిని తీసుకుని కుమ్మరి గూడెంలోకి వెళ్ళేడు. ఆ శాతవాహనుడు (శాతమనగా సింహమును వాహనముగా గలవాడు.) భగవత్ప్రసాదమనియు, తన రాజధానికి రాజై గొప్ప ప్రతిభాశాలి కాగలడనియు చెప్పి వారిని ఒప్పించి వారందరినీ, శాతవాహనునీ తనవెంట తన రాజదానికి తీసుకువచ్చాడు.

ద్వీపకర్ణుడు మంచి ముహూర్తంలో శాతవాహనునికి పట్టంకట్టి తన సీమకంతటికీ రాజుగా నిండు సభలో ప్రకటించాడు. అనంతరం వానప్రస్థాన్ని స్వీకరించి అడవికి వెళ్ళిపోయాడు.

బాలరాజు శాతవాహనుడు ధాన్యకటకం రాజధానిగా చేసుకొని చాలకాలం పాలించి మేటి యనిపించుకున్నాడు. ప్రజాదరాన్ని పొందేడు. గుణాఢ్యుడను పండితుడు ఇతని పరిపాలనను "శాలివాహన గాథాసప్తశతి" అను పేరిట ఏడు వందల పద్యాలలో వర్ణించాడు. క్రీస్తుతో క్రీస్తుశకంవలె శాలివాహన శకం ఇతనితో ఆరంభ మైంది.

ఆంధ్రావనిలో పుట్టినందుకు ప్రతిఆంధ్రుడూ ఇలాంటి ఆంధ్ర వీరుల చరిత్రలెన్నో తెలిసికోవల్సి ఉంటుంది.



విజయవాడలో అయ్యదేవర కాళేశ్వరరావుగారి నాయకత్వాన బాలబాలికల ఊరేగింపు.

బాలానందం :

# నమ్మిక

అమెరికాలోని న్యూయార్కుపట్టణంలో ఒకనాడు కొంతమంది భాగ్యవంతుల పిల్లలు బజారులో ఆడుకొంటున్నారు. కొంతమంది బీదవాళ్ళ పిల్లలుగూడా వారివద్దకు



జేరి వారు తిని పారవేసిన ఎంగిలి పండ్లకొరకై వారిలోవారు పోట్లాడుకొంటున్నారు. కార్ణవాలే యను ఒక భాగ్యవంతుడు ఆదారిన పోతూ అక్కడ నిలచి ఆపిల్లల తమాషా చూస్తున్నాడు. ఇంతలో పదిసంవత్సరముల బీదపిల్లవాడొకడు కార్ణవలేవద్దకు వచ్చాడు. వాడి గుడ్డలన్నీ చిరిగిపోయి వున్నాయి. ముఖం వాడిపోయివున్నది. వాడిని చూడగానే వాడిపైన ఎవరికైనా దయ కలుగుతుంది. వాడు అగ్గిపెట్టెలమ్ముకొంటున్నాడు. అమెరికా దేశములో భిక్షమెత్తడం మహాపరాధం. అందుచే బీదవాండ్లిలా చిన్న చిన్న వస్తువులమ్ముకొని జీవిస్తుంటారు. ఈ కుర్రవాడుగూడా అలానే నిప్పుపెట్టెలు అమ్ముతూ జీవిస్తున్నాడు. ఆ దారిన పోయేవారినందరినీ తన అగ్గిపెట్టెలు కొనవలసినదని ప్రార్థిస్తుంటాడు. కొంతమంది దయామయులు వీరి వస్తువులను కొని దాని ఖరీదుకంటే ఎక్కువ ధనం వారికిచ్చి బీదవారికి సహాయపడుతుంటారు. ఆ పిల్లవాడు కార్ణవాలేదగ్గరకు వచ్చి మహాశయా!

"రవి"

ఒక పెన్నీకి నా అగ్గిపెట్టె కొనండి భగవంతుడు మీకు మేలు చేస్తాడు.

నాకిప్పుడగ్గిపెట్టె లవసరం లేదన్నాడు కార్ణవాలే.

పిల్లవాని కన్నులవెంట నీరు తిరిగాయి. పిల్లవాని కంటివెంట నీరు చూచేసరికి కార్ణవాలేమనసు కరిగింది. అబ్బాయీ! నిన్ను చూస్తే జాలివేస్తున్నది. కానీ నా దగ్గర చిల్లర లేదు డాలరు వున్నది.

బాబయ్యా! నాతల్లి పదిరోజుల నుండి జ్వరముతో బాధపడుతున్నది. ఇంట్లో ఒక్క పెన్నీగూడా లేదు. నిన్నటినుండి ఉపవాసమే. దయచేసి ఒక్క అగ్గిపెట్టె కొంటే డాలరు నేను మార్చుకొని వస్తాను.

కార్ణవాలే యితరులను నమ్మి ఎన్నడూ డాలరు చేతి కిచ్చియుండలేదు. కాని పిల్లవానిమాటలకు జాలిపడి జేబులోడాలరు తీసి పిల్లవాని చేతి కిచ్చి అబ్బాయీ! త్వరగా మార్చుకొనిరా. నేను యిక్కడ నీకొరకు పదిపదిహేను నిమిషాలుంటాను. నాకు తొందరపని వున్నది. నీవు త్వరగా రావాలి అన్నాడు.

బాబాయ్యా! నేను బీదవాడి ననీ, అన్నానికి లేక బాధపడుతున్నాననీ, డబ్బు అవసరములో నున్నాననీ అనుమానించకండి. కొంచె మాలస్యమైనా మీ విలాసము చెప్పండి మీడబ్బు తెచ్చి మీ కప్పగిస్తాను. కార్ణవాలేకు పిల్లవాడు తిరిగి వస్తాడనే నమ్మకం లేకపోయినా తన అడ్రసుకాగితము పిల్లవానిచేతి కిచ్చాడు. పిల్లవాడు అడ్రసు డాలరు తీసికొని బజారుకు వెళ్ళినాడు. కార్ణవాలే పదినిమిషాలు చూచి పిల్లవాడు రాకపోవడముచేత యింటికి పోయాడు. సాయంత్రమైనా పిల్లవాడు తిరిగి రాలేదు. అతనికి అనుమానం వేసింది. కాని అతని హృదయంమాత్రం అతను చాలా నమ్మకమైన కుర్రవాడని చెపుతోంది. పిల్లవాడు నమ్మకమైనవాడని హృదయం చెపుతోందే ఎందుచేత రాలేదా అని ఆలోచింపసాగాడు.

ఇంతలో నౌకరు వచ్చి అయ్యా! మీకొరకెవరో కుర్రవాడు వచ్చాడన్నాడు.

వెంటనే తీసుకురా.

పిల్లవాడు లోపలికి వచ్చినాడు కానీ ఆ పిల్లవాడుమాత్రం కాదు.

పిల్లవాడు లోపలకు వస్తూనే

అయ్యా! తమరేనా కార్ట్ వాలే మహాశయులు.

అవును.

అయ్యా! నా సోదరుడు మిమ్ములను కలుసుకోవలెనని చాలా కుతూహలపడుచున్నాడు. వా డిప్పుడు ఆస్పిటలులో నున్నాడు. మీ డాలరు మార్చుకొనివస్తూ దారిలో కారు క్రింద పడినాడు. వాడి కిప్పుడే స్పృహ తెలిసింది. మిమ్ములను కలవరిస్తున్నాడు. దయచేసి ఒక్కపర్యాయము వచ్చి చూచిపోగోరుచున్నాను.

కార్ట్ వాలే గాబరాపడ్డాడు. వెంటనే దుస్తులు వేసికొని ఆస్పత్రికి బయలుదేరాడు. కార్ట్ వాలేను చూడగానే పిల్లవాని సంతోషానికి మేర లేకపోయింది. అతని ముఖం మీద చిరునవ్వు తాండవించింది.

మహాశయా! నమస్కారము. ఇదిగో మీ మిగతా డబ్బు నా దిండుక్రింద వున్నది తీసికోండి. నేను మీ డబ్బు యివ్వకుండా చనిపోతానేమో నని చాలా భయపడినాను. ఆలస్యమైనందుకు మీరు నన్ను మరోవిధంగా భావించ రనుకొంటాను. నా తల్లి రోగంతో బాధపడుచున్నది. నా అన్న ఆకటి బాధతో అలమటిస్తున్నాడు. బహుశా భగవంతు డిలానే మా నుదుట వ్రాశా డనుకొంటాను. అన్నాడు.

ఈ మాటలు వినేసరికి కార్ట్ వాలేకండ్లవెంట నీరు తిరిగాయి. పిల్లవాని శరీరాన్ని చేతితో నిమురుతూ అబ్బాయ్! ఏమీ పరవాలేదు. నీతల్లి, సోదరుడు బ్రతికివున్నంతవరకు నేను పోషిస్తాను, నీవు భయపడవ ద్దన్నాడు.

మరునాడు కుర్ర వాడు చనిపోయాడు.

[ఆంగ్లంనుండి]

# ఆశకు పోతే?

ఒక గ్రామంలో ఒక వ్యాపారి వుండేను. ఆ వ్యాపారి 200 రూ గల సంచి ఒకటి పోగొట్టుకొన్నాడు. 200 రూ గల సంచి నాది ఒకటి పోయింది. అది తెచ్చియిచ్చినవారికి 100 రూ॥ బహుమాన మిస్తానని చాటించాడు.

ఆసంచి ఒక మంగలికి దొరికింది. మంగలి ఆ చాటింపు విని వ్యాపారి దగ్గరకు పోయాడు. "నా సంచి ఎలాగూ దొరికింది. వీడికి ఇపుడు 100 రూ। ఇవ్వాలి. వీనికి 100 రూ। ఇవ్వకుండా సంచి తీసుకొనే మార్గం ఏదైనా ఆలోచించాలి" అని మనస్సులో అనుకుని మంగల్ని ఇలా ప్రశ్నించాడు.

ఏమయ్యా, నీకు నాసంచి దొరికిందా?

"అవును దొరికింది నా బహుమానం ఇస్తే ఆసంచి తెచ్చిఇస్తా" అన్నాడు మంగలి.

ఆ సంచిలో రెండు వందల రూపాయలు ఒక వజ్రపుఉంగరము

శ్రీ చట్టూరి రామకోటీశ్వరరావు

ఉండాలి వెళ్ళి తీసుకరా నీబహుమానం ఇస్తానన్నాడు వ్యాపారి.

"ఆసంచిలో కేవలం రెండువందల రూపాయలు మాత్రమే ఉన్నాయి. ఉంగరం లేదు" అన్నాడు మంగలి.

"ఉండాలి...ఎందుకు లేదు? నీవు దాన్ని ఎక్కడో దాచి సంచిలో ఉంగరం లేదంటున్నావు! తీసుకురా సంచి అంటూ గదమాయించాడు వ్యాపారి.

మంగలి ప్రమాణాలు చెయ్యటం మొదలుపెట్టాడు.



కాని వ్యాపారి "నీవు నాసంచి తీసుకరాకపోతే న్యాయవాదిదగ్గర ఫిర్యాదు చేస్తా" నన్నాడు ఆశతో.

మంగలికికూడ కోపం వచ్చింది. "ఫిర్యాదుచేసుకోండి" అన్నాడు మంగలి.



జనవరి 24 వ తేదీన రాజ్యాంగపరిషద్భవనంలో పరిషత్సభ్యులు మాతృరాజ్యాంగంపై సంతకాలు చేశారు. ఆసందర్భంలో తీయబడిన ఛాయాచిత్రం ఇది.

చివరకు వ్యాపారి న్యాయవాది దగ్గిర ఫిర్యాదు చేశాడు.

న్యాయవాది మంగలిని పిలిపించి అడిగాడు. "అసమ్యా సంచిలో రెండువందల రూపాయలుమాత్రమే ఉన్నాయి. ఉంగరం లేదు. ఆయన సంచి దొరికినవారికి వందరూపాయలు బహుమాన మిస్తానని చాటించాడు. నేను నాకు దొరికిందని ఆయనదగ్గరకు వెళ్ళేసరికి ఉంగరం సంగతి బయట పెట్టాడు. అన్నాడు మంగలి. అపుడు న్యాయవాది వ్యాపారినిలా అడిగాడు. నీఉంగరం ఎలా వుంటుంది? నీవు దాన్ని ఎక్కడ కొన్నావు? దానిని తయారుచేసినవాడెవరు? వాడెక్కడ వుంటాడు?

ఇపుడు వ్యాపారికి పచ్చివెలక్కాయ గొంతుకలో పడ్డట్టయింది. అతను జవాబులు తికమకలుగా చెప్పాడు. న్యాయవాది వ్యాపారిఅంతా అబద్ధం చెపుతున్నాడని తెలిసికొన్నాడు. "మంగలికి దొరికిన సంచి నీది కాదు" అన్నాడు న్యాయవాది. ఇంకా ఇలా అన్నాడు. నీసంచి వేరొకరికి దొరికిఉంటుంది. మరు నీవు ప్రారంతా చాటింపు వేయించు నా సంచిలో రెండువందలరూపాయలూ ఒక వజ్రపుఉంగరం ఉండాలని. న్యాయవాది మంగలిని పిలిచి ఇలా అన్నాడు. ఓయీ! ఈసంచి ఈ వ్యాపారిది కాదు. నీవీ సంచి రెండు నెలలవరకుఉంచుకో. దాంట్లో నుంచి ఒక్కరూపాయికూడా ఖర్చు చెయ్యకు. రెండునెలల తర్వాత సంచి ఎవ్వరికీ చెందకపోతే ఆ సంచిలోని ధనంఅంతా నీవు ఖర్చు చేసుకో" అని అన్నాడు న్యాయవాది.

ఇది విన్న వ్యాపారి మొహంలో నెత్తురు లేకుండాపోయింది. "నేను ఆశకుపోయి అసలుకూడ పోగొట్టుకొన్నా" నని అనుకున్నాడు వ్యాపారి మనస్సులో!



భారత రిపబ్లిక్ అధ్యక్షులు బాబూ రాజేంద్రప్రసాద్ గారు, జనవరి31వ తేదీన పార్లమెంటులో తమ ప్రథమోపన్యాసం చేయటానికి బయలుదేరే ముందు, తమ మంత్రివర్గంతో సహా పరివేష్టించివున్న దృశ్యం.

# చైతన్యం కలిగిన చెట్లు

శ్రీ భైరవభట్ల రామబ్రహ్మశాస్త్రి

జంతువులతో పోల్చిచూస్తే మొక్కలకు చెట్లకు చైతన్యమే ఉన్నట్లు కనిపించదు, ఉత్సాహమే ఉన్నట్లు అనిపించదు, చేయుపనులే ఉన్నట్లు గోచరించదు. అందుచే మొక్కలు లేనిదే మనుష్యులే లేరని గుర్తించుట కష్టము. చెట్లు చేయు పనులు అపారములేకాక అనన్యసామాన్యములు: నత్రజనితో కూడిన రసాయనికపదార్థాల నెన్నో తయారుచేయుచున్నవి, అంతేకాక భూమ్యాకర్షణశక్తిని యెదురించి—అడుగుకు పోవలసినదిబదులు—చెట్లు మొక్కలు పైకి యెదుగుచున్నవి. ఇవన్నీ కాలక్రమేణా జరుగుచున్నవేకాని తళుక్కున మానవులను మెరిపించి కులికించలేకున్నవి. (చెట్లుచేయు పనులన్నీ) ఏదో స్వప్నదృశ్యాలవలె గోచరించుచున్నవేగాని చైతన్యముతో కూడినవిగా కానరావు. చెట్లను గురించి మనకు రాసాయనికంగాను, భౌతికంగాను ఎక్కువ తెలియునేగాని వాటి దినచర్య, జీవనవిధానములనుగూర్చి ఎక్కువ తెలియదు. వాటి అంతర్వృత్తులను గురించి అసలే తెలియదు. అందుకనే వాటికి బాహ్యశక్తులవల్ల చైతన్యము కలిగినప్పుడే, నిర్నిద్రావస్థను విడచి ప్రపంచముతో కొంత సంబంధము పెట్టుకున్నప్పుడే వాటి పరిచయభాగ్యము మనకు కల్గును, వాటి పరివర్తనాపద్ధతులు మనకు తెలియును, వాటి అంతర్నిహితశక్తులు మనకు అవగతము లగును.

ఎన్నిసార్లు చూడలేదు ? చీకటి పడుటతోడనే నిద్ర గన్నేరుచెట్టు ఆకులు ముడుచుకుపోవుచున్నవి. ఇవి ప్రకాశములో మాత్రమే తన ప్రభ చూపించి చిమ్మచీకటిలో చిన్నబుచ్చుకొనుచున్నవి. తామరపూలు పగల్లా విచ్చుకొనియుండి రాత్రి రావటంతోనే చిరాకుపడుచున్నవి. కొన్ని కొండగులాబుల్లో (హీలియాన్థిమమ్) సూర్యకాంతి ఉన్నంతసేపూ పూలువిచ్చుకొని కొస్త మబ్బుపైకి రావటంతోనే ముడుచుకుపోవుచున్నవి. పువ్వు నడుమను తాకితే కైవారమునైపు బయటకు విచ్చిపోవును. ఇట్టి తాకుడే ప్రకృతిసహజంగా పురుగుల కాళ్ళచేత యెన్నోసార్లు కలుగుచున్నది. అప్పుడల్లా పుప్పొడి ఆ పువ్వులో చేరుచున్నది. ఇంతేకాక దీని కింకొక కదలిక కూడాకలదు. ఇది సూర్యరశ్మిలో జరుగును. తిరిగి మనకు జవాబిచ్చుచున్నదో యనునట్లు ఇది మన ముందఱికే వ్రాలుచుండును. ఇదేవిధమగు కదలిక కంచెలో నున్న "బార్బరీ" చెట్లలోనూ కలదు. దీని పువ్వు నడిమికర్ణికలో తాకితే బయటికి కాక గర్భకేసరములలోకి ముడుచుకుపోవును. ఇట్టికదలికలవల్లనే పుప్పొడి తేలికగా చేరుటకు, స్థిరముగా కర్ణికలో నుండుటకు వీలగుచున్నది. ఇట్లు ప్రపంచములో నొక ప్రాణికి మఱియొక ప్రాణికి సన్నిహితసంబంధము కలదు.

ఉత్తర కెరోలినాలో కొన్ని బురదనేల మొక్కలున్నవి. వీటి ఆకును మధ్యకుచీల్చే తొడిమకు మూడు బిఱుసువెంట్రుకలు కలవు. ఇవి నిక్కబొడుచుకొని యుండును. వీటిని గనుక తాకితే తొడిమ కిరుభాగాలు చఱ్ఱున ముడుచుకుపోవును. రెండుచివరల అంపపుపళ్ళవలెనున్న ఆకుఅంచులు ఒకదానిలో నొకటి యిరుక్కొని తాళము బిగించినట్లుండును. ఈవిధంగా ఆకుఅంచులు మన్యకు ముడుచుకుపోవటంలో నడిమివెంట్రుకలను తాకిన వస్తువు అందులోని చిక్కుపడిపోవును. ఆకు ముడుచుకుపోవటంలో ఏదో ఒక విద్యుత్ప్రభావమున్నదని జాన్ బర్డన్ శాండర్సన్ అనే ఆయన అంటాడు. ఇంక దీనిని మోసంచేయటానికి పదేపదే మనము వెంట్రుకలను తాకితే "మన నేడిపించటానికిట్లా ఊరికే తాకుతున్నా"రని ఆ చెట్టు గ్రహిస్తుంది. అంతటితో ముడుచుకోటం మానేస్తుంది. కాని యీ జ్ఞాపకం తెలివి కొద్దిసేపుమాత్రమే ఉంటుందిట. సెల్యులోజ్ అనేపదార్థము మొక్కలోని ప్రోటోప్లాస్టు అనే తత్త్వకణాన్ని ఆవరించియుంటుంది. అందుచే నిది యెక్కువగా చైతన్యము చూపించుటకవకాశము లేకున్నదిట. అయినా యింకా చిన్నపిల్ల మొక్కలలో చైతన్య మెక్కువగా కనిపిస్తూనే యుంటుందిట. అప్పుడే పెరగటం మొదలుపెట్టిన ఒక విత్తనపు పైమొన మెల్లగా చుట్టూ తిరుగుందిట. ఇది వంగుతూ వాలుతూ కూడా ఉంటుందిట. పై అంకురము, వేరుకూడా తమాషాగా కదలుతాయట. ఆకులు పైకి క్రిందకు పడుతూలేస్తూ ఉంటాయట. సూర్యరశ్మి హెచ్చుతగ్గులనుబట్టి పూవులు విచ్చుకొంటూ ముడుచుకొంటూ ఉంటాయట. లతలు అవి చుట్టుకొనియుండే చెట్లపరివర్తనలను జాగ్రత్తగా పరికిస్తూ వాటిని చుట్టుకుచుట్టుకు తిరుగాడునట. ఈవిధంగా చెట్లు సూర్యరశ్మికై తమ తహలాడుతూ, నివసించటానికి తావు వెదకికొంట్లూ, భక్షించటానికి ఆహారము వెదకికొంటూ, నవనవలాడుతూ నాజూకుగా పెరుగుతూనట్టేటిలో కలిసిపోతూ, కదలుతూ మెదలుతూ, ఆటంకాలను అధిగమిస్తూ, పరిసరాలకు తగినట్లు పరివర్తనం చెందుతూ, అన్యోన్యసంబంధాలను అధికం చేసికొంటూ, ఆర్ద్రభూమిలోనే ఆవాసమేర్పరుచుకొంటూ, మెలకువతో మసలుతూ—అన్నివిధాలా అన్ని పోలికలలో జంతువులతో సరిసమానంగా తులతూగగల్గుచున్నవి. ఈవిధంగా చాలా చెట్లకు చైతన్యము కలదని జె. సి. బోసుమహాశయుడు కనుగొన్నాడు. నిసర్గస్థితుల కనుగుణంగా మార్పుచెందుతూ, చైతన్యం కలిగించేదానికల్లా చలిస్తూ ఆఖరికి దారినిపోయే మబ్బును చూసి కూడా మార్పు కనపఱుస్తూ మొక్కలే కాదు చెట్లు కూడా పెరుగునని ఆయన అన్నాడు.

## ఫరీద్‌పురంలోని ప్రార్థించే చెట్టు

శ్రీ "జగదీశచంద్రబోసు" ఇంకా ఒక వింతవిషయాన్ని చెప్పుచున్నాడు. ఫరీద్‌పురంలో ఒక ఖర్జూరవృక్షము కలదు. సాయంసంధ్యాసమయంలో శివాలయంలో గంటలు గణగణమనటంతోనే ఆ చెట్టు ముందుకు వ్రాలి జాగిలపడునట. తిరిగి ఆ

మఱునాడు ప్రొద్దుపొడుచుటతోడనే అదియును లేచునట. ఈవిధముగా ప్రతిరోజూ చేయునట. ఎప్పుడో ఒక తుపానువచ్చి భూమికి లంబముగా నున్న ఆ చెట్టును 60° కోణముండునట్లు వంచియుండవచ్చునట. ఈ సదుపాయముచేత సాయంత్రమగుటతోడనే ఆ చెట్టుఉపరికాండము దాదాపు ఒక గజముపొడవు వంగునట. పొడుగాటి ఆ ఆకులు, ప్రొద్దునపూట ఆకాశాన్ని అంటుతున్నాయా అనే అంత ఎత్తులోనున్న ఆ ఆకులు సాయంత్రానికల్లా సంపూర్ణముగా వంగి నేలకానునట. ఇట్లు దాదాపు ఆరు గజాల దూరము ఆ యాకులు వంగునట.

"మామూలుగా చూచేందుకిది మనిషికి రెండింతలకన్నా పెద్దదిగా, ఒకభూతం లాగా కన్పించుచుండును. సాయంత్రమగునప్పటికి సాష్టాంగదండప్రణామము చేయు పరమభక్తునివలె ఎక్కడో గోపురమంతెత్తున ఉన్న ఆకులనువంచి, నేలకానించి, దేవుని పూజించుదానివలె నుండును." ఇది పగటి, రాత్రివేళల ఉష్ణోగ్రతాభేదములబట్టి అయి ఉండునని శాస్త్రజ్ఞులూహించుచున్నారు.

అత్తపత్తి చెట్టు అనేదానికే సోకుడుముడుగుచెట్టు అని కూడా పేరుగలదు. దీనిని తాకినట్లయితే ఇది నిద్రించేదానివలె పడుకొనునట. దీనిఆకులు చాలా అందమైనవి. ఒక్కొక్క దళానికి నాలుగు గుత్తులుండును. ఒక్కొక్క గుత్తికి చాలా చిన్నఆకుల గుంపులుండును. నాలుగుభాగాలను కలుపు కాడ అడుగున ఉండును. వీటన్నిటికి అడుగున "పుల్వీనస్" అనే కణములుండును. ఒక్కనిప్పుపుల్లను వెలిగించి ఒక గుత్తి చిన్నఆకుల దగ్గరకు తీసుకువచ్చినవెంటనే ఆ ఆకులన్నీ పైకి ముడుచుకుపోవును. పిమ్మట యీ వార్త రెండవగుత్తికడకు పోవును. వెంటనే ఆ గుత్తిఆకులు కూడా ముడుచుకుపోవును. తర్వాత మూడవగుత్తికి యీ సమాచారము తెలియును. వెంటనే దాని ఆకులును ముడుచుకుపోవును. పిదప నాలుగవగుత్తికి యీ వార్తలు తెలిసి, దాని పత్రాలును ముకుళించుకొనిపోవును. ఈ నాలుగు పత్రాలు కలిసి ముడుచుకుపోయే ఒక గొడుగువలె కన్పించును. వెంటనే ఆకస్మికముగా యీ సంగతిసందర్భాలు తెలిసి అడుగుకాడ వాలిపోవును. ఏ వార్తాపత్రికలును లేకనే యివి యీవిధంగా వార్తలు చేరవేసికొనును. నాళపుంజములలోని కొన్ని ప్రత్యేక భాగాలద్వారా యీ వార్తలు ప్రయాణము చేయునని హాబర్‌లాండ్ అనే ఆయన అభిప్రాయము.

జగదీశచంద్రబోసు ఈ అత్తపత్తి చెట్టును గూర్చి చాలా పరిశీలించినాడు. ఈ చెట్టు దళానికి అడుగున ఉన్న స్తూపములు పై భాగానికన్నా 80 రెట్లు చురుకుగా నుండునట.

పరిసరస్థితులతోపాటు మొక్కలేవిధంగా పరివర్తనము చెందునది, ఎట్లు మారునది, పెక్కింతలు పెద్దదిచేసి దానంతటదే చూపు యంత్రము నొకదానిని జగదీశచంద్రబోసు కనిపెట్టినాడు. దీనినే "క్రెస్కోగ్రాఫ్" అంటారు. అంతకుముందున్నవి "ఆక్సానోమీటర్లు" అనుయంత్రాలు. ఇవి మొక్కల్లోగల్గు మార్పులను ఇరవైరెట్లు మాత్రమే పెద్దవిచేసి చూపగలవు. అది కూడా అనేక గంటల కాలవ్యవధితోడనే జరుగుచున్నది. ఇట్టి సమయములో నుదయించినాడు జగన్నుతమేధావియైన జగదీశచంద్రబోసు. ఆయనమేధాశక్తిచే నైసర్గిక మార్పులకల్లకగ్గే మొక్కల్లోని మార్పులు ఇరవైకాదు, ముప్పయికాదు, పదివేలరెట్లు పెద్దవిచేసి—అది కూడ ధనవ్యయమే కాక కాలవ్యయమును లేకుండా-అర్ధనిమిషములో చూపించే యంత్రము అవతరించినది.

మొక్కలు చెట్లు ఎప్పుడో కొంతసేపు చైతన్య ముడిగియుండును. ఇదియే వీటికి నిద్రావస్థయట. జగదీశచంద్రబోసు ఇంకను ఇట్లు వ్రాయుచున్నాడు, "పదార్థములోని చైతన్యము, జీవితములోని సౌందర్యము, అభివృద్ధిలోని అతిశయము, అవయవాల్లోని ప్రేరణము—ఎంతగా ఒకదానికొకటి విడిపోయినప్పటికి, యెంతగానో ఒకదానితోనొకటి సంబంధము కల్గియున్నవి. దర్పణములోని బింబమువలె ఇంద్రియానుభవములోను, అనురాగములోను, ఊహాలోనూ, ఉత్సాహములోనూ కూడా మొక్కల నరాల్లో నాళాల్లో కలిగే చైతన్యశక్తి ఒకచోటినుండి యింకొకచోటికి పోవుటేగాక యింకొక రూపములో నుదయించుచున్నదే! వీటిలో ఏది సత్యము? ఏది శాశ్వతము? భౌతికపదార్థమా లేక తద్భిన్నమగు ప్రతిబింబమా! ఏది నశించునది? ఏది కృశింపనిది?"

---



నెహ్రూ అభినందన గ్రంథ సంఘసమావేశాలలో చివరిరోజు జనవరి 28 న రిపబ్లిక్ అధ్యక్షులు డా॥ రాజేంద్రప్రసాద్ గారు నెహ్రూ వజ్రోత్సవ అభినందన గ్రంథాలపై సంతకంచేశారు. ఆ సాయంకాలం ఇంపీరియల్ హోటల్‌లో జరిగిన ప్రముఖుల సభలో యివి గౌరవపురస్సరంగా నెహ్రూగారికి సమర్పించబడినవి.

## నవల:



# రుద్రమదేవి

శ్రీ నోరి నరసింహశాస్త్రి

## ౧౪

విజయదశమినాడు రుద్రమదేవి ఎప్పుడో తెల్లవారుజామున నిదుర లేచినది. తదాదిగా భద్రగజోత్సవము పూర్తియగువరకు నామె కొక్క క్షణ మైనను తీరిక లేదు. అనుక్షణమును దేహమునే కాక మనస్సునుగూడ ఆత్మవశమున నుంచుకొనవలసియుండెను. ఒక్క కదలికలోనేని పొరపాటు రాగూడదు. ఒక్కమాటలో ప్రమాదము పనికిరాదు. మహారాజు పరాకుపడిన ప్రజలకు విపరీత నష్టము సంభవింపవచ్చును. స్వయముగా నా మహారాజుకును ప్రజలలో గౌరవము తగ్గిపోవును. మహారాజా సజీవమగు నుత్సవవిగ్రహమాయెను!

సామ్రాజ్యమంత్రములు భూదేవులు చెప్పుచుండ గణపతిదేవులును గురుదేవులును మహామంత్రిదేవులును తన్నానాడు అభిషేకించిరి. అభిషేకప్రారంభమున మహానందతన్మయత యామెకు కలిగినది. కొంతసేపల్లె అభిషేకము చేయగా మొదటియుత్సాహ మామెకు మందగించినది. తుదకు నది తాను నిత్యము సేయు స్నానముగానే తోచినది. దేహమునకు ఉదకస్పర్శమే!

ఆ సాయంకాలవేళ మహాప్రధానసామంతదండనాథులు పేరోలగమున తనకు విధేయత ప్రకటించుచు ప్రతిజ్ఞలు చేయుచుండ ముం దామెకు వీరోత్సాహము రేకెత్తినది. కాని తరువాత తరువాత ఒకేవిధముగా పలువురు ప్రమాణములు చేయుచుండ నవి యంగీకరించుటకూడ విసుగైనది. మధ్యలో వీరభద్రేశ్వరులను బంధించుటకు పంపిన యాజ్ఞ రాకున్నచో కునుకుపాటుకూడ వచ్చియుండును. ఆ యాజ్ఞ తనకు నూతనముగా ప్రాప్తించిన రాజత్వము ఎంత కర్కశ మైనదో స్పష్టముగా ద్యోత మొనర్చినది. ఒక్కసారిగా ఆమెసర్వాంగములు నుద్బుద్ధ మైనవి.

ఆ పిమ్మట పారువేట కొంత వినోదము కలిగించినది. ఆ రాత్రి తన్ను భద్రగజముపై మంత్రిసామంతాదులు పరివేష్టించి యూరేగించిరి. భద్రగజాధిరోహణము చేయుచుండ తనకు హృదయములో నావేగము కలిగినది. క్రొత్తగౌరవము లభించువారి కెవరికి అట్టి యావేగము కలుగదు? చేరిన పెద్దలందరు 'జయజయ రుద్రదేవ మహారాజ!' యని జయజయనినాదములు చేయగా తన హృదయములోనుండి పాదములకును పాదములనుండి శిరస్సునకును అనంతకోటి జయజయనినాదములు ప్రతిధ్వనించుచు పైకిని క్రిందికిని సంచారములు చేయుచున్నట్లు తోచినవి. మరల జయనినాదములు వినవచ్చినవి. అవి విన్నప్పుడు మొదటి యానందము లేదు. మరల వినవచ్చినవి. మరల వినవచ్చినవి మరల—మరల—ఇట్లనేకపర్యాయములు వినవచ్చినకొలదియు ఆమాటల కర్థమే లేనట్లు భాసించినది. అవి కేవల మేవో ధ్వనిమాత్రములుగా భాసించినవి. తుదకీయుత్సవ మెప్పు డయిపోవునను తొందర యావహించినది. ఎట్లో ఉత్సవము పూర్తియైనది. మంత్రిసామంతాదులను సెల విచ్చి పంపివేసినది. అంతటితోనైన నామెకు స్వాతంత్ర్యము చిక్కలేదు.

ఇప్పుడు తాను మూర్ధాభిషిక్తరాజన్యమూర్తి. అంతఃపురములో భోజననివాసములే కాక శయనీయముకూడ నియమబద్ధముగాగాని స్వీకరింపరాదు. అక్కడ రక్షణకు సర్వసంపన్న మొనర్చిగాని అంగరక్షకుడు సెలవుతీసికొనలేదు.

ఇన్నిటితో రుద్రమ యారాత్రి మిక్కిలి ప్రొద్దుపోయికాని నిదురింప వీలులేకపోయెను. రాజధర్మముప్రకారము మహారాజు అభ్యంతరమందిరమున నేకాంతముగా నిదురింపవలెను. అతివిశ్వాసపాత్రులగు రక్షకులే యప్పు డుండవలెను. వారును దూరమున నుండవలెను. అట్లు నిదురించుటయు స్వల్పకాలమే కర్తవ్యము. అదియును ఆదమరచి నిదురింపరాదు.

రుద్రదేవమహారాజును నిదురబుచ్చ పవళింపుపాటలు పాడిన వైణికులు పర్వతనాయకునివెంటనే సెలవు పుచ్చుకొని వెడలిపోయిరి. దూరమున రుయ్యమయు కామసానియు తమ మందిరములలో నిదురింపబోయిరి.

రుద్రమ శయ్యపై మేను వాల్చగనే నిదురపట్టలేదు. ఒక్కమారు గవాక్షమునుండి కనిపించు స్వయంభూదేవుల దేవాలయశిఖరమువంకను నాలుగుగోపురములవంకను చూచి భగవద్ధ్యానముచేసినది. స్వయంభూలింగేశ్వరాలయమునకు ఆవల ఉన్నతమైన ఏకశిల కానవచ్చినది. ఆ శిలపై చిన్నజ్యోతి ఉన్నది. జ్యోతికి క్రిందుగా నా శిల బ్రహ్మరక్షస్సువలె భయంకరముగా తోచినది. అంతలో నామెకు నిద్రపట్టినది.

రుద్రమ కొంతవడి అట్లు సుఖనిద్ర వోయెను. ఆమెకు ఒంటబట్టిపోయిన కామందకనీతివాక్యములు చిత్రముగా సుషుప్తిలోగూడ నామె కొక మేలుకువ కూర్చెనో! కాక స్వప్నావస్థ సంభవించెనో! ఏమో కాని యామె కిట్లు భాసించెను.

తాను విజన మగు నొక మహారణ్యమార్గమున బోవుచున్నది. అది మిక్కిలి సన్నని దారి. కంటకలతాగుల్మములు పైని కప్పుకొని

పడుచుండగా నెమ్మదిగా అవి తప్పించుకొని తాను ముందుకు సాగి పోవుచున్నది. అంతలో నా వనమధ్యమున నిష్కుంజలతాతరు వగు విశాలప్రదేశ మొందు చేరికొని యామె నిట్టూర్చుచు పరాకుగా నున్నది. ఆకస్మికముగా నలుగెలకులనుండి భైరవగర్జనములు విన వచ్చినవి.

తా నెన్నిమారులు వేటపోయినది ! ఎన్ని రకముల కుక్కల దా నెరుగును ! పొడుగుమూతివి గుండ్రని ముఖము కలవి పొడుగు కాళ్లవి ఉన్నత మైనవి పొట్టివి పిక్కబలము కలవి సూక్ష్మముగా పనిపట్టగలవి పడిచేయనివి విలాసార్థమే ఉపయుక్త మగునవి—ఎన్ని జాతులో ఆమె ఎరుగును. వేటకాండ్రు వాని నెన్నోవిధముల ప్రయోగించి యాఖేటమున దనకు సాయ మొనర్చువారు. వేట కవి యవసరములు, అలంకారములు. మరి యవియే వేటాడబడువన్యముల కతిభయంకరములు.

నే డీ కుక్కలు పూర్వ మట్లు కావు. నలుమూలలనుండి ఇవి తనపైకే కవియుచున్నవి. ఇప్పుడు తానే వేటాడబడు జంతు వైన ట్లున్నది. సేనాధిపు నెదిరించు సైన్యములవలెనే యవి నీతి తప్పినవి. అంతే కాదు. శునకలక్షణము లామెకు కరతలామలకములు. అదియు నామె యాచార్యులయొద్ద నృపవిద్యలతోపాటు క్షుణ్ణముగా నభ్యసించినది. ఇవియో ? తా నెన్నడు కనిగాని వినిగాని యున్నవి కావు. శాస్త్రములో చదివినట్టివిగూడ కావు. ఇవి యసలు శ్వానము లేనా ?

శ్వానములేకాని యివి యీ లోకములో నెవ్వరు నెక్కడ నెన్నడు నెరిగినవి కావు! ఆ స్వర్గలోకమునుండి దిగివచ్చినవా ? పాతాళగహ్వరములనుండి పై కెక్కియే వచ్చినవా, ఇవి మరి ? పెద్ద పెద్దదేహములు ! ఆ దేహములను నిడుపు లగు రోమములతో దట్టముగా నిండియున్నవి. అవి సమీపించుచున్నంతనే ఒకానొక ఏవగింపు పుట్టి ఒడలు జలదరించుచున్నది. దానితోపాటు ఒక చిత్రమగు భయమును కలిగించుచున్నవి. వీని భాంకారమే వేరు ! కుక్కలిట్లెక్కడనేని మొరుగునా ? ఇవి కుక్కలు కావు, పిశాచము లై యుండును. కాక కాలభైరవుడే యీ యాకారములు దాల్చి వచ్చియుండునా ?

"తీక్ష్ణదంష్ట్ర మహాకాయ కల్పాంతదహనోపమ
భైరవాయ నమ స్తుభ్యం............

ఎట్టి యపాయములం దైన భయపడకుండుట రుద్రమ చిన్ననాటనుండి యలవరచుకొన్నది. అన్ని భయములకు మూలకారణము ప్రాణభీతి! మృత్యుభయము లేనివారి కేభయము నుండదు. పవిత్రకార్యములు ఉన్నతకార్యములు సత్కీర్తికరకార్యములు చేయుట కుద్యమించుట యామె నేర్చుకొన్నది. అనృత మన్న హైన్యమన్న జుగుప్స నేర్చుకొన్నది. ఈ శరీరము ఉదాత్తకార్యకరణమున కంకిత మొనర్చుట యామె యలవరచుకొన్నది. రాజోత్తములు తమ సర్వస్వము ప్రజాక్షేమమునకు అర్పిత మొనర్పవలె నను విధి యామె యాచరణలో నున్నది. ఇక నామెకు భయ మేల యుండును ?

నిర్భయముగా నామె యా చుట్టిన శునకముల నదలించెను. వినను అవి వెనుకాడక పైపైని కవియుచున్నవి. కొన్ని యామె కాళ్లు పీకుటకును మరికొన్ని పార్శ్వములను ఇకకొన్ని బాహువులను ఒకటి శిరస్సునే పట్టుకొనుటకును ఉంకించుచుండెను. రుద్రమ కత్తిదూసెను. దానితో నొకదాని తల నరకెను. ఇంకొకదాని ముందుకాళ్లు తెగనేసెను. మఱియొకదాని ప్రక్కలు గంటుచేసెను. వేరొకదాని కంఠమున దూసికొనిపోవునట్లు పొడిచివేసెను. కొండొకదాని తలనుండి తోకవరకు చీల్చివైచెను.

కాని చిత్రము! తల తెగినదానికి మరల తల యదుకుకొన్నది. ముందుకాళ్లు పోయినదానికి ముందుకాళ్లదుకుకొన్నవి. బరులు చీలినదానికి బరులు యథాప్రకార మున్నవి. కంఠములో పోటువడినది స్వస్థమై యున్నది. నిలువున జీలినది నిలువున నిలిచియే యున్నది.

శ్రీరామచంద్రమూర్తి ఎన్నిమారులు తెగనేసినను రావణుని తల లిట్లే మొలచెనా ? భీమసేను డెన్నిసారులు చీల్చిపార వేసినను జరాసంధుని దేహపుచిప్ప లిట్లే యదుకుకొనెనా ? ఇవి నిజముగా పాంచభౌతికశరీరము లున్న సారమేయములేనా ? కాక కేవల మంధకారమే యీ రూపముల నవతరించెనా ?

రుద్రమ మరల వానిని చీల్చివేసెను. మరల నవి కలసికొనెను. మరల నవి యాటోపముతో నామెపై కవియసాగెను. అవి యామె దేహమును కోరలతో చీల్చియేవేసెను. కాని యంత తీక్ష్ణము లగు కోరలతో నవి తన శరీరమును జీల్చుచున్నను తనకు బాధ లేదేమి ? తన కాయమునుండి కండలును నెత్తురును వాని నోటి కందుచునే యుండెను. అవి తాకినప్పుడెల్ల తనకు జుగుప్స కలుగుచున్నది. ఎంత జుగుప్స ! ధర్మాత్మునకు అనృతముపై కలుగునంత జుగుప్సయే అప్పు డామె కావహించుచున్నది!

ఇది కలయా ? నిజమా ? ఇంత ప్రత్యక్షముగా చూచుచున్నది చెవులకు వినబడుచున్నది కల యెట్లగును ? కలలో నిట్టి యాలోచన లెన్నడైన గలుగునా ? ఆమె ఏకాకిని. ఎంత ధీర యైనను, భయమువంటి యొకానొక వృత్తి యామె చిత్తాంచలముల నడుగిడసాగెను. ఆ కుక్కలను నరుకనరుక నామెబాహువు లలసట నొందుచుండెను.

అంతలో నా వనాంచలములయం దొక పురుషమూర్తి గోచరించెను. ఒక్కక్షణకాల మామె యావైపు పేరాసతో చూచెను. మరుక్షణమున జూడగా ఆ పురుషుడే తనపై నా భైరవముల నుసికొలుపుచున్నట్లు ఆమెకు స్పష్టమయ్యెను. ప్రకృతిసిద్ధ మగు వీరావేశముతో నా సారమేయముల సరకుగొనక రుద్రమ ఖడ్గము త్రిప్పుచు నా పురుషునిపై కురికెను.

సమీపింపగా, నేమి యాశ్చర్యము, అది వీరభద్రేశ్వరుని మూర్తి, తన భర్తయాకారమే ! ఆమెవిజృంభణ మాకస్మికముగా నాగిపోయినది. అప్రయత్నముగా నామెకంఠమువెంట గంభీరమైన స్వరము వెలువడెను :

"మేచయనాయకా ! ఇతని నింకను బంధింపలే దేమి ?"

దానికా వీరభద్రేశ్వరుడు కహకహధ్వానముతో పెద్దపెట్టున నవ్వెను. అది నవ్వా ? సకిలింపా ?

రుద్రమమాటలును వీరభద్రేశ్వరుని సకిలింపును అంతఃపురమెల్లెడ ప్రతిధ్వనించెను !

* * *

ఇంతవరకును రుద్రమ తాను కన్నులతో చూచుచుంటి ననియు చెవులతో వినుచుంటి ననియునే భావించుచుండెను. కాని యిప్పుడు చూచుచున్నవిధానమును వినుచున్నవిధమును వేరు. ఇప్పుడు అంతఃపురమునం దంతట ప్రవృత్తమైన సందడియే వేరువిధముగా వినబడుచున్నది. ఇప్పుడు చూడగా తా నరణ్యములో లేదు. ఆ యరణ్యమధ్యమందలి విశాలప్రదేశము లేదు. తన శయనమందిర

ములో హంసతూలికాతల్పమున శయనించి యున్నది. పర్యంకసాల భంజికలు యథాపూర్వముగనే దర్శన మిచ్చుచున్నవి. తన దేహము నుండి యా కుక్కలు కొరికి వేరుచేసిన మాంసభాగము లన్నియు సరిగనే యున్నవి. కుక్కలును లేవు! కాని యామెదృష్టి కెదురుగా వీరభద్రేశ్వరుడుమాత్రము సుఖాసనమున గూర్చుండి యున్నాడు!

అంతలో కామసానియు రుయ్యమయు ఖడ్గములు చేబూని అడావుడిగా నేతెంచిరి. ఉపచారములు చేయు కుబ్జ వారివెంట వారిని కలసికొనవలె నను నావేగముతో ఒక ప్రక్క కొరగి రెండవ కాలు త్వరత్వరగా ఎగురవేయుచు చేత నొక చీపురు ధరించి వచ్చెను. అంతఃపురరక్షకు డగు క్లీబవిదల్లుడును శీఘ్రగమనమున వచ్చెను.

"ఎవరిని బంధింపవలె, తల్లీ?" యని యా విదల్లుడు ప్రశ్నించెను.

రుద్రమ వీరభద్రేశ్వరునివైపు నిర్దేశించుచు చూచెను. రుద్రమ చూపుల ననుసరించి యాతడు వీరభద్రేశ్వరుని నక్కడ జూచి యాతనికి నమస్కరించెను. వీరభద్రేశ్వరుడు బంధనార్హు డని యాతడెరుగడు.

కామసాని రోషావేశముతో వీరభద్రేశ్వరు నెన్నియో నిష్ఠురోక్తు లాడెను. వీరభద్రేశ్వరుడు ప్రత్యుత్తర మీయలేదు.

"దొంగవలె ఇక్కడికి వచ్చితి వేమి?—హంతకుడవా?—పిలువనిదే ఏల ఇట వచ్చితివి?—పలుకవు, చెవుడా?—నోరేమైనా పడిపోయినదా?—పిశాచమువా మనిషివా?—"

ఎన్ని యన్నను బదులు పలుకడు. మౌనము!

కామసాని ఖడ్గముతో నాతని పొడువనుంకించి ఎడమచేతితో గొంతు పట్టుకొనెను. అతడు ఎదురుతిరుగలేదు. వెనుదీయలేదు. కామసాని యాతని గొంతుపై చేయివేసినది. కాని గొంతు చేతికి పట్టు చిక్కదే! వీరభద్రేశ్వరుని గొంతులోనికే యామె వ్రేళ్లను చేయియు పోయెను. కాని యామెచేతికి అది తాకిన స్పర్శజ్ఞానమే లేదే!

"ఇది మనిషి కాదు, పిశాచము!" అని కామసాని కెవ్వనకక వేయుచు వీరభద్రేశ్వరుని యుదరములో కత్తితో పొడిచెను. కత్తి లోపలికి పోయినది కాని రక్తము చిమ్మలేదు. ఆ వీరభద్రేశ్వరుని శరీరము చెక్కుచెదరలేదు.

"చచ్చినవారు దయ్యము లగుట ఎరుగుదుము. నీవు బ్రదికియుండియే దయ్యమవైతివా!"—ఇట్లనుచు కుబ్జ తన చేతిలోని చీపురుతో వీరభద్రేశ్వరుని ఒడలెల్ల మోదెను. రుద్రమదేవియు రుయ్యమయు నా యగౌరవము జరుగకుండ వారింపబోయిరి కాని యందు కవకాశము లేకపోయినది. కుబ్జచేతులే ముందాయెను.

ఇదియంతయు రుయ్యమ కొండొకతడవు నిర్విణ్ణయై చూచుచుండెను. మరియొకతడవు ధ్యానించెను. వీరభద్రేశ్వరు డిచ్చటికి వచ్చు మార్గము లేదు. ఇదియొక కల్పితమూర్తి. ఇంతమంది కిది యొక్కసారి భాసించుచుండుట చిత్రమే. ఇంద్రజాల మిట్లే యుండు నందురుగదా!

మరుక్షణమున రుయ్యమకు ఒక ప్రతిక్రియ బుద్ధిలో భాసించెను.

"అమ్మా!"

రుద్రమ: "ఏమి తల్లీ?"

రుయ్యమ: "శ్రీవిశ్వేశ్వరశంభుదేశికులను ఒక్కసారి చిత్తములో దృఢముగా స్మరించుకోవే అమ్మా!—వారు మొన్న నాకొక మహామంత్ర ముపదేశించి ఆపదలో రక్షార్థముమాత్రమే యుపయోగింపు మని యాదేశించినా రమ్మా!"

ఇట్లనుచు నామె రుద్రమశయ్యాసమీపమున గల విభూతి చేనందుకొని యభిమంత్రించి రుద్రమదేవి దేహమున నలదెను. రుద్రమదేవి శ్రీ విశ్వేశ్వరశంభుదేశికుల పాదపద్మముల చిత్రములో ధ్యానించెను.

అంతట నట్లభిమంత్రిత మగు భూతిని ఒక్క చిటికెడు తీసికొని రుయ్యమ ఎదురుగా నాసనమున సుఖోపవిష్టుడైన వీరభద్రేశ్వరమూర్తిపై చిలుకరించెను.

వెంటనే ఆ వీరభద్రేశ్వరమూర్తి యా గాలిలోనే కలసిపోయెను. ఆసనమువెనుక నున్న చీకటిలోనికే మాయమయిపోయెను!

# స్వరాజ్యంలో సమస్యలు

శ్రీ వేలూరి
సహజానందం

స్వాతంత్ర్యంతోపాటు 'పాకిస్తాన్'కూడా ఏర్పడింది. ముస్లిం లీగుకు చెందిన మహమ్మదీయులు స్వరాజ్యంకోసం బ్రిటిషు ప్రభుత్వంతో ఎప్పుడూ పోరాడకపోవటమేకాక, కాంగ్రెసు ప్రతిఘటన సల్పినప్పుడల్లా, స్వాతంత్ర్యోద్యమానికి అడ్డుతగిలేవారు. కాంగ్రెసుకు వ్యతిరేకంగా నిలబడి, విదేశప్రభుత్వానికి మద్దతుగా ఉన్నవారిలో 'లీగర్లు' ముఖ్యులు.

కాంగ్రెసునాయకులు దేశవిభజనకు ఒప్పుకొని, అందుకుగాను శాంతియుతంగా పాకిస్తాన్ ఏర్పడాలని ఎంతో ప్రయత్నించినా, 'లీగర్లు' పాకిస్తాన్ స్థాపనతో తృప్తిపడక, అనాదినుంచి తాము హిందువులపై ప్రకటిస్తున్న ద్వేషదాహం తీర్చుకోటానికై హిందువుల చిత్రవధకు పూనుకున్నారు. మనదేశపు ముస్లిం లీగర్ల చరిత్ర నౌఖాలీ, పంజాబ్ అమానుష, దుర్భరదురంతాలతో మరింత కలుషితమైంది. హత్యలు, మానభంగాలు, శిశువులవధ, బలవంత వివాహాలు, ఈ రాక్షసచర్యలతో తమ జాతికి తీరని కళంకం కలిగించారు. ప్రతీకారంతో హిందువులూ అక్కడక్కడ ముఖ్యంగా బీహారులో హద్దుదాటి అత్యాచారాలు చేశారు. కాని నాయకులు, హిందువుల్లో అధికసంఖ్యాకులు వీటిని తీవ్రంగా ఖండించారు. బీహారు కల్లోలంలో జవహర్‌లాల్ నెహ్రూ ఆ రాష్ట్రానికి వెళ్లి, హిందువులు అత్యాచారాల నరికట్టకపోతే, 'బాంబు' చేస్తానన్నాడు. కాని చివరకు కాంగ్రెస్‌లోని మహమ్మదీయులైనా మహమ్మదీయప్రాంతాలకు వెళ్లి కల్లోలాన్ని తగ్గించ ప్రయత్నించలేకపోయారు.

గాంధీజీ మతశాంతికోసం అహోరాత్రాలు పనిచేశాడు. నౌఖాలీలో రాక్షసులగా పరిణమిస్తున్న మహమ్మదీయులను గాంధీజీ శాంతిబోధచేసి, మళ్లీ మనుష్యులుగా మార్చాడు. ఢిల్లీలో మతశాంతికోసం ఉపవాసదీక్ష పూనాడు. చివరకు ఒక హిందూ దురహంకారునిమూలంగా, బలవన్మరణానికి గురిఅయాడు.

కాని మహమ్మదీయుల్లో చెప్పుకోదగిన నాయకు డెవడూ (గాంధీజీ శిష్యులుతప్ప) 'లీగు' సభ్యుడుగాని, 'కాంగ్రెసు' సభ్యుడుగాని కల్లోలప్రాంతాలకువెళ్లి, మంటలను చల్లార్చ ప్రయత్నించలేదు! బీహారులో, ఇతరత్ర కొంతమంది హిందువులు అమానుషమైన దురంతాలు జరిపి, అధఃపతితులైనా, అదేసమయంలో హిందువుల్లో మరికొంతమంది ఈ రాక్షసత్వాన్ని ఖండించి, హిందువులు ప్రతీకారానికి పూనుకోకూడదని వారించి, సఫలులై, జాతిని పునరుదరించారు. గాంధీజీ, నెహ్రూ, పటేల్, ప్రసాద్, జయప్రకాశ్ నారాయణ్, లోహియా, పట్వర్ధన్, ఆచార్యకృపాలినీ, సుచేతకృపాలినీ, ప్యారిలాల్ తమ ప్రాణాలనుకూడా లెక్కచేయక కల్లోలప్రాంతాల్లో తిరిగాడు—హిందూమహాసభ, ఆర్. యస్. యస్. మతద్వేషపు నల్లతాచుయొక్క రెండునాలుకలై అనుక్షణం బుసకొట్టుతున్నప్పటికీ ఈ ముఖ్యసత్యాన్ని ఎవరూ మరువకూడదు.

దేశవిభజన జరిగినా, హిందువులపై ద్వేషం తీరని 'లీగర్ల' దౌర్జన్యంమూలంగా హిందువులు సుమారు కోటిమందికిపైగా పాకిస్తానునుంచి ఇండియన్ యూనియన్‌కు కాందిశీకులుగా వచ్చారు.

ఇండియన్ యూనియన్‌లో సుమారు 87,000 చ॥ మైళ్ల ప్రాంతంలో కల్లోలం చెలరేగితే, పాకిస్తాన్‌లో 300,000 చ॥ మైళ్ల ప్రాంతంలో చెలరేగినయ్. ఇండియాలో 93% ప్రాంతంలోని మహమ్మదీయులు సురక్షితంగా ఉన్నారు.

పశ్చిమ పాకిస్తాన్‌నుంచి కాందిశీకులుగా వచ్చిన హిందువులు అక్కడ విడిచిపెట్టిన విలువ సుమారు రు 4,000 కోట్లు. ఇండియానుంచి వెళ్లిన ముస్లింకాందిశీకుల ఆస్తివిలువ సుమారు రు 400 కోట్లు.

పశ్చిమ పంజాబ్‌నుంచివచ్చిన హిందువుల భూమి 80 లక్షల ఎకరాలకుపైన ఉంది. వీటిలో చాలాభాగం నీటివనరున్న భూమి. తూర్పుపంజాబ్, పాటియాలా, నాభా, జింద్, ఫరీద్‌కోట, కపూర్‌థాలాప్రాంతాల్లోనుంచి వెళ్లిన మహమ్మదీయుల భూమి సుమారు 40 లక్షల ఎకరాలు. ఇందులో చాలాభాగానికి నీటివనరు లేదు.

విభజనమూలంగా, ఇదివరకు మొత్తం ఇండియాలో పంటకింద ఉన్న భూమిలో ఈ కింద చూపిన పాళ్లు పాకిస్తాన్‌కు వెళ్లినయ్.

| | పాకిస్తాన్‌కు వెళ్లిన భూమి |
|---|---|
| ధాన్యం | 26% |
| గోధుమ | 24 95 |
| జనపనార | 72.9 |
| పత్తి (అమెరికా రకం) | 18.02 |
| మొత్తం నీటి వనరున్న భూమి | 31.82 |

మొత్తం నీటివనరున్న 4.1 మిలియన్ల ఎకరాలలో, 3.3 మిలియన్ల ఎకరాలు (పత్తి) పాకిస్తాన్‌కు వెళ్లినయ్.

ఇంత హింసాకాండతో, దేశవిభజనతో సంప్రాప్తించిన స్వాతంత్ర్యం ఆరంభంలోనే అత్యంతవిషమసమస్యలను ఎదుర్కోవలసివచ్చింది.

పాకిస్తానునుంచి వచ్చిన హిందూకాందిశీకులు ఆస్ట్రేలియా మొత్తం జనాభాతో సమానం. ఈ లక్షలమంది అభాగ్యులకు తిండి,

బట్ట, ఉండటానికి ఆధారం చూపించటం ప్రభుత్వానికి ముఖ్య కర్తవ్యమైంది. కోట్లకుకోట్లు ఖర్చుపెట్టవలసివచ్చింది.

1949 అక్టోబరుకు కాందిశీకులకు ప్రభుత్వం చేసిన సాయం పరిశీలిద్దాం—

**2,76,000** మందికి భూవసతి ఒనగూర్చారు. భూమిమీద ఆధారపడి, పునర్నిర్మాణం కొనసాగించుకోనేందుకుగాను, వీరికి సుమారు రు **2.64** కోట్లపైగా అప్పిచ్చారు. పాకిస్తాన్‌కు వెళ్లిన ఇండియన్ మహమ్మదీయుల ఇళ్ల లో 14 లక్షలమంది కాందిశీకులు ఉండే ఏర్పాటుచేశారు. **25,000** నివాసగృహా లెక్కువగా నిర్మిత మైనయ్. **19,000** నిర్మాణంలో ఉన్నయ్. ఇవికాక 9,000 ఇళ్ల స్థలాలు కాందిశీకులకు ఇచ్చారు.

పాకిస్తాన్‌కు వెళ్లిన మహమ్మదీయుల దుకాణాలను **28,000** వాటిని కాందిశీకులకు ఇచ్చారు. **11,000** దుకాణాలు నిర్మితమైనయ్. ఇంకో 2 600 దుకాణాలకు స్థలమిచ్చారు. 3,800 నిర్మాణంలో ఉన్నయ్. కాందిశీకులు స్వయంగా కట్టుకునేందుకుగాను 375 దుకాణాలకు కావలసిన స్థలం ఇచ్చారు.

విడిగా వ్యక్తులు, స్థానికసంస్థలు కట్టినవి లెక్కలోకి రావు.

పునర్నిర్మాణంకోసం, వ్యాపారసదుపాయాలకని, విద్యార్థుల చదువుకుగాను ప్రభుత్వాలు రు 6.78 కోట్లపైగా అప్పలిచ్చారు.

**12,000** మందికిపైగా 'టెక్నికల్' శిక్షణ పొందారు.

**1,31,600** మంది ఉద్యోగాల్లో ప్రవేశించారు. వీరిమీద ఆధారపడే జీవులు **6,58,000.**

మొత్తంమీద దేశంలో స్త్రీలకు, పిల్లలకు కలిపి 26 నివాస కేంద్రా లున్నయ్. వీటిలో 10,800 మంది ఉన్నారు. వీరిలో పిల్లలు 5,000 మంది.

కాందిశీకశిబిరాల్లో ఉచితాహారంమీద జీవిస్తున్నవారు, 3.09 లక్షలమంది.

కేంద్రప్రభుత్వం, ఇతరప్రభుత్వాలతో కలసి ఇంత సహాయం చేస్తున్నప్పటికీ, కాందిశీకుల సమస్య ఇంకా అతిక్లిష్టంగా ఉంది. ఇంకా చేయవలసింది చాలా ఉంది. ఈ సమస్య బెంగాలులో తీవ్రంగా ఉంది. సత్వరం ఈ సమస్యను పరిష్కరించనిదే, బెంగాలులో శాంతిభద్రతలు సుస్థిరం కాజాలవు. ప్రభుత్వంచేస్తున్న పనుల్లో, ముఖ్యంగా కాందిశీకులకు పొలాలిచ్చే సందర్భాల్లో కొన్నిచోట్ల అన్యాయాలు జరుగుతున్నయ్. కొద్దిమందికి చాలా పొలం ఇచ్చి, ఇతరులకు చాలా తక్కువ ఇస్తున్నారు. ఇలాంటి లోపాలను ప్రభుత్వాలు గుర్తించి, దిద్దుకోవాలి. లేనిపక్షంలో కాందిశీకులమధ్య ద్వేషం వ్యాపిస్తుంది.

ఈ సందర్భంలో ఒక విషయం చెప్పాలి. పాకిస్తాన్ ప్రాంతానికి చెందిన జాతీయహిందువులు కొంతమంది, నాయకులు ముఖ్యంగా పాకిస్తాన్ విడిచి, ఇండియాకు వచ్చారు. ఇదివరకటి సాహసత్యాగశక్తి సన్నగిలి, వీరు పాకిస్తాన్ దౌర్జన్యాన్ని ప్రతిఘటించలేకపోయారు. ఇలాంటివారు కొంతమంది ఇండియాలో అధికారస్థానాలుకూడా సంపాదించగా, అక్కడి సామాన్యప్రజానీకం నాయకుల పలాయనంమూలంగా మరింత భీరువులై, అచటి మహమ్మదీయుల దౌర్జన్యాన్ని ప్రతిఘటించలేక ఇండియాకు వచ్చేస్తున్నారు. ముఖ్యంగా సింధు, తూర్పుబెంగాలు రాష్ట్రాల్లో మహమ్మదీయుల అత్యాచారాలు అధికమవటంమూలంగా, హిందువులు అక్కడనుంచి తరలివస్తున్నారు. ఇప్పటి పరిస్థితులు చూస్తే పాకిస్తాన్‌లో హిందువులు ఉండగలిగే అవకాశాలు తగ్గిపోయేట్టుగా గోచరిస్తోంది. ఇది రెండుదేశాలకు పెద్దసమస్య. ఇక్కడి 'ముస్లింలీగర్లు', మహమ్మదీయనాయకులు పాకిస్తాన్‌కు వెళ్లి, ఆ దౌర్జన్యవాతావరణాన్ని చక్కబఱచి, హిందువులకు శాంతిభద్రతలు సిద్ధించేట్టు ప్రయత్నించటం వారి విధి.

## ఆ హా ర స మ స్య

కాందిశీకుల సమస్యతరువాత ప్రధానమైనది ఆహారసమస్య. ఈ ఆహారసమస్యను మనం త్వరలో పరిష్కరించకపోతే దేశపు అభివృద్ధి కుంటుపడుతుంది. పారిశ్రామికవిస్తరణ దెబ్బతింటుంది. విదేశాల్లో ఆహారధాన్యాలు కొనటంమూలంగా రు. 130 కోట్లు ఖర్చు అవుతోంది.

ఇతరదేశాలనుంచి మనం దిగుమతి చేసుకుంటున్న ఆహారధాన్యాలు:—

| సంవత్సరం. | (పది లక్షల టన్నులు) |
|---|---|
| 1946 | 2.25 |
| 1947 | 2.32 |
| 1948 | 2.83 |
| 1949 | 3.69 |
| | 11.0 |

సగటున ఏడాదికి 2.8 మిలియన్ల టన్నుల ధాన్యాన్ని దిగుమతి చేసుకుంటున్నాం. ఇదివరకు ఏడాది సగటుకు రెట్టింపు. ఈ దిగుమతుల విలువ:—

| సం. | రు. కోట్లు. | ధాన్యాలపై ప్రభుత్వం ఇచ్చే 'సబ్‌సిడీ' |
|---|---|---|
| 1946-47 | 89 | 20.59 (కోట్లు రు.) |
| 1947-48 | 108 | 17.12 |
| 1948-49 | 131 | 26.50 |

మనకు ఆహారధాన్యాల కొరత 40 లక్షల టన్నులు. ఉత్పత్తి 4 కోట్ల, 26 లక్షల టన్నులు. అంటె కొరత 10% ఉంది. 100 లక్షల టన్నులని ఒక లెక్క.

దేశవిభజనమూలంగా మనకు ఆహారపుపంటక్రింద ఉన్న భూమి తగ్గింది. ఇదివరకటి పంజాబ్ రాష్ట్రంలోని 16 'నీటి కాల్వ' వసతుల్లో 3 మాత్రమే తూర్పుపంజాబ్‌లో ఉన్నయ్. 1945-46 లో పాతపంజాబ్ రాష్ట్రంలోని 4 కోట్ల నీటివసతున్న ఎకరాలలో 30 లక్షల ఎకరాలే తూర్పుపంజాబ్‌లో ఉన్నయ్.

విభజనతర్వాత ఇండియన్ యూనియన్‌లో ఇదివరకటి ఇండియాజనాభాలో 75% ఉన్నప్పటికి, ఇదివరకు వీరికింద ఉన్న భూమిలో 70%, గోధుమకింద ఉన్న భూమిలో 60% మాత్రమే ఉన్నయ్.

ధాన్యంబాగా రాలుబడి ఉన్నప్రాంతాలుకూడా పాకిస్తాన్‌లోనే ఉన్నయ్. ఇండియా పాకిస్తాన్ ప్రాంతాల్లో రాలుబడి:—

| పంట తిండిపంటలు | | ఇండియాలోని రాష్ట్రాల్లో ఎకరానికి పౌన్లు | | పాకిస్తాను రాష్ట్రాల్లో ఎకరానికి పౌన్లు |
|---|---|---|---|---|
| బియ్యం | ... | 717 | ... | 813 |
| గోధుమ | ... | 580 | ... | 685 |
| 'జోవార్' | ... | 357 | ... | 456 |

| | | | | |
|---|---|---|---|---|
| బజ్రా | ... | 314 | ... | 458 |
| మొక్కజొన్న | ... | 715 | ... | 976 |

డబ్బుపంటలు

| | | | |
|---|---|---|---|
| ప్రత్తి | 81 | 169 | (400 పౌన్లు ఒక 'బేలు' చొప్పున, 1000 బేళ్ల ప్రకారం) |
| జనపనార | 1087 | 1354 | |

ఇండియన్ యూనియన్‌లో మొత్తం పంటలకింద వున్న భూమిలో 'ఇరిగేషన్' వసతి ఉన్న భూమి ¼ వంతుకుకూడా తక్కువే. పాకిస్తాన్‌లో మొత్తం పంటల కిందవున్న భూమిలో 44% భూమికి 'ఇరిగేషన్' వసతి ఉంది. కాబట్టే తిండిపంటలు, డబ్బుపంటలుకూడా పాకిస్తాన్‌లోనే ఎకరానికి ఎక్కువగా రాలుబడి అవుతున్నయ్.

ఇదివరకే క్లిష్టంగా ఉన్న సమస్య విభజనతో మరింత తీవ్రమైంది. కేంద్రరాష్ట్రప్రభుత్వాలు ఆహారవిషయంలో స్వయంపోషకంగా ఉండేందుకని తీవ్రంగా పనిచేస్తున్నారు.

1952 నాటికి ఆహారధాన్యాలదిగుమతు లుండకూడదని, మనకు కావలసిన ధాన్యం మనమే పండించుకోవాలని ప్రభుత్వాలు ప్రయత్నిస్తున్నయ్.

1952 ఏప్రిలుకు మనజనాభా 363 మిలియన్లు అవుతుంది. 36 కోట్లపైన. వీరిలో 100 కి 86 గురు ఆహారందృష్ట్యా పెద్దలు ('ఎడల్ట్స్'). పల్లెజనాభా 100 కి 70 గురు. ఈ మొత్తంజనాభాకు 46.5 మిలియన్లటన్నులు కావాలి. ఏడాదికి ఉత్పత్తి 42 మిలియన్ల టన్నులు. కొరత 4.5 మిలియన్ల టన్నులు.

1947-48, '48-49 ల్లో అమలు జరిపినవిధానాలమూలంగా ½ మిలియను టన్ను లధికంగా ఉత్పత్తి అవుతాయని; '49-50, 50-'51 ల్లో అమలుజరిపేవిధానాలబట్టి 3.6 మిలియన్లటన్నులు ఉత్పత్తి అవుతాయని ప్రభుత్వపు అంచనా.

## పారిశ్రామిక సమస్య

ఆహారసమస్యతర్వాత పారిశ్రామికఉత్పత్తి ముఖ్యమైన సమస్య. ఇదివరకల్లా కార్మికులు సమ్మెచేయటంమూలాన ఉత్పత్తి తగ్గుతోందనేవారు. కాని 1947 డిసెంబరులో ప్రభుత్వం సూచించిన 'పారిశ్రామిక - శాంతి' ఒడంబడికకు కార్మికులు మొత్తంమీద కట్టుబడి ఉన్నారని జాతీయ ట్రేడుయూనియన్ కాంగ్రెస్‌వారు (కాంగ్రెసుప్రభుత్వాల కార్మికసంస్థ), ప్రభుత్వం కూడా ఒప్పుకొన్నారు. ఆర్థికమంత్రి జాన్ మత్తయ్ కార్మికుల దేశభక్తిగురించి ఇటీవల ప్రశంసించాడు.

కార్మికులు సమ్మెచేయనప్పటికీ, పారిశ్రామికఅభివృద్ధి తగ్గట్టుగా లేదు. నిజానికి పారిశ్రామికులు, పెట్టుబడిదార్లు కోరిన కోర్కెలన్నిటికీ క్రమంగా ప్రభుత్వం తలొగ్గుతూనే ఉంది.

'కనీసజీతం' 'లాభాల్లోకార్మికుల భాగం' వీటన్నిటికీ ముందు పారిశ్రామికప్రతినిధులు ఒప్పుకొన్నా, తర్వాత దేనికీ ఒప్పుకొనలేదు. 48 - 49, 49 - 50 'బడ్జెట్' ల్లో పెట్టుబడిదార్లకు వారికోర్కె ప్రకారం పన్నులు తగ్గించారు. ఇంకా తగ్గిస్తామని వచ్చుచెప్పుతున్నారు. 'నేషనలైజేషన్' పదేళ్ళలోపు ఉండదని ప్రభుత్వం హామీ ఇచ్చింది. అప్పటికీ ఉండకపోవచ్చునని కూడా అంటున్నారు. అయినప్పటికీ పారిశ్రామికులు, పెట్టుబడిదార్లు ఉన్న ఉత్పత్తిశక్తినికూడా సరిగా వినియోగించుకోలేదు, కొత్త పరిశ్రమల స్థాపనకు పూనుకోవ్వలేదు.

మన పరిశ్రమల్లో వినియోగింపబడని ఉత్పత్తిశక్తి.

| పరిశ్రమ | వాడని ఉత్పత్తిశక్తి % |
|---|---|
| ఉక్కు | 40 |
| సిమెంటు | 38 |
| పంచదార | 30 |
| ఎలక్ట్రిక్ మోటార్లు | 50 |
| మెటల్సు, హెవీకెమికల్సు | 40 |
| సిగరెట్లు, నిప్పుపెట్టెలు | 40 |

అధికోత్పత్తి తక్షణకర్తవ్యంగా ఉన్న ఇప్పట్లో, ఉన్న ఉత్పత్తిశక్తిఅంతా పూర్తిగా వినియోగింపబడకపోవటమే కాక, చాలా మిల్లులను, ఫ్యాక్టరీలను మూసివేస్తున్నారు.

215 కర్మాగారాలను (మొత్తం) మూశారు. 80,000 మంది కార్మికులు నిరుద్యోగులయ్యారు.

రాష్ట్రంవారీగా మూసివేసిన ఫ్యాక్టరీల సంఖ్య చూద్దాం:—

| రాష్ట్రం | మూసిన ఫ్యాక్టరీలు | కార్మికులు |
|---|---|---|
| బొంబాయి | 34 | 37,272 |
| ఢిల్లీ | 9 | 1,320 |
| పశ్చిమ బెంగాలు | 12 | 5,900 |
| బీహారు | 14 | 2,400 |
| ఒరిస్సా | 30 | 1,231 |
| మద్రాసు | 37 | 2,950 |
| తూర్పు పంజాబు | 2 | ... |
| యు. పి. | 42 | 16,600 |
| సి. పి. | 25 | 3,000 |
| సౌరాష్ట్ర | 2 | 2,000 |
| మధ్యభారత | 5 | .... |
| హైదరాబాద్ | 4 | 609 |
| | 216 | 73,282 |

పరిశ్రమవారీగా మూసివేసిన ఫ్యాక్టరీలు:—

| పరిశ్రమ | మూసినఫ్యాక్టరీలు. |
|---|---|
| బట్టలమిల్లులు | 41 |
| బియ్యపుమిల్లులు | 29 |
| నూనె ,, | 24 |
| ఇంజినీరింగు | 7 |
| గాజు | 24 |
| నిప్పుపెట్టెలు | 14 |
| తోళ్లు | 13 |
| కెమికల్సు | 2 |
| ఆహార, పానీయాలు | 6 |
| వగైరా | 39 |
| | 199 |

అధికోత్పత్తి, పారిశ్రామికవిస్తరణ లేకపోగా ఉన్న ఫ్యాక్టరీలే మూసివేస్తున్నారు. కార్మికుల సమ్మెలు ఇందుకు కారణం

కాదు. డబ్బులేక, ముడిపదార్థాలు లేక, లాభాలులేక...మూసి వేశారు.

బట్టల మిల్లులను మూయటంమూలంగా నెలకు 20 నుంచి 25 మిలియన్ల గజాలగుడ్డ ఉత్పత్తి తగ్గి దని పారిశ్రామికమంత్రి శ్యామ ప్రసాద్ ముఖర్జీ చెప్పారు.

5 ల పరిశ్రమల్లో ఉత్పత్తిగురించి ప్రభుత్వం చేసిన పరిశీలన ప్రకారం, కార్మికుల సమ్మెలమూలంగా ఉత్పత్తి తగ్గింది. 5 పరిశ్రమల్లో మాత్రమే.

1947 డిసెంబరులో ప్రభుత్వం 'డి-కంట్రోలు'కు ఒప్పుకుంది. ధరలు పెంచమని పారిశ్రామికులు, వ్యాపారులు హామీ ఇచ్చారు. కాని ధరలు పెరిగినయ్.

అన్ని సరుకుల ధరలు

| సంవత్సరం | (1939—100) |
|---|---|
| 1947—నవంబరు | 302 |
| 1948—మార్చి | 340.7 |
| 1948—జూలై | 389 6 |
| 1949—మార్చి | 370.2 |

'డి—కంట్రోలు' విధానాన్ని దేశద్రోహులు స్వార్థంకోసం వినియోగించుకున్నారు— పెట్టుబడిదార్లు వ్యాపారులు.

1948 అక్టోబరులో 'ఇన్ఫ్లేషన్' తగ్గించేందుకని ప్రభుత్వం, కొన్ని విధానాలను అవలంబించారు. కాని ధరలు పడలేదు.

అన్ని సరుకుల ధరలు

| సంవత్సరం. | (1939—100) |
|---|---|
| 2-10-'48 | 382.0 |
| 25-12-'48 | 382.5 |
| 26-11-'49 | 389.7 |
| 2-12-'49 | 385.7 |
| 10-12-'49 | 381 6 |
| 17-12-'49 | 381.2 |
| 24-12-'49 | 379.9 |

1949 అక్టోబరు—నవంబరుల మధ్య 394.8 నుంచి 390.4 ఉంది.

1939 లోకంటె ఇప్పటికి మన (టోకు) ధరల ప్రమాణం300% పెరిగింది. కొన్నిచోట్ల జీవనపు భత్యపు విలువ (*Cost of living*) ప్రమాణం 400% పైగా పెరిగింది. కార్మికుల కూలీలు:260% పెరిగింది.

1947 డిసెంబరులో ప్రభుత్వం 'డి—కంట్రోలు'కు ఒప్పుకున్నాక వస్తువుల ధరలు తగ్గకపోవటమే కాక, ఇంకా పెరిగినయ్. అప్పటినుంచి కార్మికుల 'జీవనభృతి' ఎలా పెరిగిందిచూడామాన్దాం:—

| నగరం. | 1947 డిసెంబరు | 1948 జూలై | 1949 జూలై |
|---|---|---|---|
| బొంబాయి | 271 | 297 | 302 |
| అహమ్మదాబాదు | 299 | 443 | ... |
| ఢిల్లీ | 128 | 140 | 134 |
| కలకత్తా | 332 | 356 | 354 |
| కాన్పూరు | 389 | 516 | 486 |
| నాగపూరు | 330 | 385 | 378 |
| జబల్‌పూర్ | 332 | 391 | ... |
| మద్రాసు | 305 | 320 | 320 |
| లూధియానా | 155 | 169 | ... |

(1939=100)

ధరలు తమజీతాలకు మించి ఉన్నా, నిజజీతాలు క్షీణిస్తున్నా, కార్మికులు సమ్మెల్లో పాల్గొనకుండా, పారిశ్రామికఉత్పత్తికి తోడ్పడ్డారు.

పారిశ్రామికఉత్పత్తి క్షీణిస్తున్నా, పారిశ్రామికవిస్తరణ జరగకుండా ఉన్నా, ఫాక్టరీలు మూసి వేయటానికి పారిశ్రామికులు, పెట్టుబడిదార్లు...వీరే కారణం. యుద్ధకాలం విపరీతమైన లాభాలు మరిగి, ఇప్పుడా లాభాలు వచ్చే పరిస్థితిలేనందువలన, పారిశ్రామిక అభివృద్ధికి పూనుకోవటంలేదు. యుద్ధంతర్వాత ఇదివరకటికంటె లాభాలు 4 రెట్లనుంచి 10 రెట్లదాకా పెరిగినయ్. ఇప్పుడా 'బంది పోటుతనా' నికవకాశం లేదు. వస్త్రపరిశ్రమలో భాగస్వాముల కిచ్చిన ప్రతి పదిరూపాయల డివిడెండుకు మేనేజింగు ఏజంట్లు రు 15 లు తీసుకున్నారని ఒకరి అంచనా. పన్నుకందకుండా దాచిన సొమ్ము 500 కోట్లపైగా ఉందంటారు.

ప్రభుత్వం తలపెట్టిన పరిశ్రమల అభివృద్ధి, పరిశీలనబిల్లు వెనక్కువెళ్ళింది. ప్రభుత్వానికి ఉత్పత్తిపై అధికారం లేకపోతే, ఉత్పత్తి సక్రమంగా, అవసరాలకు తగ్గట్టు ఎలా అభివృద్ధిచెందుతుంది? 4 నెలలక్రితం మూసివేసిన షోలాపూరుమిల్లులను తెరచి చేయించ టానికి ఇప్పుడే ప్రభుత్వం 'ఆర్డినెన్సు' జారీచేసింది. ఈమాదిరిగా వ్యవహరిస్తే, ప్రభుత్వం ఎలా ఉత్పత్తిని ప్రజలశ్రేయస్సు కుపయోగ పడేట్టు వృద్ధిచేయగలదు? మరి ఇంకామూసివేసే ఉన్నమిల్లుల నెప్పుడు తెరిచేది? పత్తిలేక కొన్ని మిల్లులు మూస్తున్నారు. ప్రభుత్వానికి పరిశ్రమలపై సంపూర్ణాధికారం లేనిదే, ఇలాంటి అవకతవకలను అరికట్టటం సాధ్యంకాదు. చేతులు కాలాక ఆకులు పట్టుకోవటమే ప్రభుత్వవిధానంగా ఉంది—ఉపన్యాసాలెలా ఉన్నా ఇందుకు బదులుగా, పెట్టుబడిదార్లు ఈ బిల్లును ఖండించగానే, ప్రభుత్వం వాళ్లకు తలొగ్గింది?

ఈ నాలుగునెలలనుంచి బట్టల మిల్లుల్లోని కార్మికులేకనుక సమ్మెచేసిఉంటే, నాయకులు, మంత్రులు ఎంతగొడవచేసేవారు? ప్రజలుకూడా తర్జనభర్జన చేసేవారు. ఉత్పత్తికి కార్మికులు అడ్డు తగులుతున్నారని ప్రభుత్వం గర్జించేది. 144 సెక్షన్, లాఠీచార్జి వగైరాకూడా జరిగి ఉండేవి. కార్మికనాయకులకు దేశహితవు లేదని ఖండించేవారు. కాని ఇప్పుడు? కిమన్నాస్తి. దాదాపు 100 మిలియన్ల గజాలగుడ్డ ఉత్పత్తి తగ్గినా, ప్రజలనుంచి తగిన ఆందోళన లేదు. ప్రభుత్వం తగినట్టు ప్రవర్తించలేదు.

కార్మికులు సమ్మెచేస్తే, పోలీసులు, మిలిటరీ, 'ఆర్డినెన్సు'లు. కాని యజమానులు చేస్తే?

పారిశ్రామికరంగంలో ప్రభుత్వమవలంబిస్తున్న విధానం సఫలం కాదు. ప్రభుత్వం అధికసంఖ్యాకుల శ్రేయస్సుకోసం పాటుపడాలి అనే ఈరోజుల్లో పెట్టుబడిదార్ల స్వార్థంమీదే ప్రభుత్వం ఆధారపడితే, అల్పసంఖ్యాకుల భోగానికి, అధికృతకు ఉపయోగపడుతున్న ఇప్పటి ఆర్థికనిర్మాణం తగిన మార్పులు జరగనిదే ప్రజాశ్రేయస్సుకు ఎలా ఉపయోగించగలదు? దేశఅభివృద్ధి కోసం ప్రతివాడూ త్యాగం చేయాలని ప్రభుత్వపు మంత్రులు, నాయకులు, ఎన్నిగంభీర, ఉదాత్త ఉపన్యాసాలిచ్చినా, ఎక్కువ ప్రయోజనం లేదు. లాభాలు, భోగాలు, అత్యధికఆదాయాలు. వీటిరోజులు బానిసత్వంతోపాటు అంతరించినాయని పెట్టుబడిదార్లు గుర్తించి, చిత్తశుద్ధితో కొత్త జీవితవిధానాన్ని అవలంబించినంత కాలం, పెట్టుబడిదార్లు దేశభక్తి గురించి ఎన్ని ప్రకటనలు చేసినా లాభమేముంది?

పరిపాలించేది సోషలిస్టుప్రభుత్వం అయినా, 'నేషనలైజేషన్' కొన్ని పరిశ్రమల్లో అమలుజరుగుతున్నా, లేబర్‌పార్టీతో హోరాహోరిగా పోరాడుతున్నా ఇంగ్లండులోని పెట్టుబడిదార్లు, పారిశ్రామికులు ఉత్పత్తికిగాని, పారిశ్రామికవిస్తరణకుగాని అడ్డుపడుట్లేదు. అభిప్రాయభేదాలు ఎన్ని ఉన్నా, ఉత్పత్తిని కుంటుపరచుట్లేదు. మనదేశంలో ప్రభుత్వం పెట్టుబడిదార్ల ప్రభుత్వమే కాకపోయినా, పెట్టుబడిదార్లు కోరిన కోర్కెలకు మంత్రులు ఒప్పుకుంటున్నా, పారిశ్రామికులు, పెట్టుబడిదార్లు తగిన సహకారం ప్రదర్శించుట్లేదు.

## శాంతిభద్రతలు

ప్రభుత్వ సుస్థిరత, శాంతిభద్రతలదృష్ట్యా, మన ప్రభుత్వం బాగా దృఢంగా ఉంది.

బర్మా స్వతంత్రదేశం అవటమేకాక, 'కామన్‌వెల్తు'తో సంబంధంకూడా తెంచుకుంది. కాని దేశం హింసావాతావరణంతో విచ్ఛిన్నమైంది. జనాభాలో నాలుగోవంతుమందే ప్రభుత్వ ఆధిపత్యంకింద ఉన్నారు. అయితే తిరుగుబాటుదార్లు ఇంతవరకూ ఎక్కడ పోటీప్రభుత్వం స్థాపించలేకపోయారు.

సిలన్ స్వతంత్రదేశమైనా, బ్రిటిషుప్రభుత్వానికి వైమానిక, నావిక, సైనిక వసతులను ఇచ్చింది.

ఇండొనీసియాస్వాతంత్ర్యం అసంపూర్ణం. దేశంలో తిరుగుబాటు సాగుతోంది.

పాకిస్థాన్ ఇంకా రాజ్యాంగరచనను పూర్తిచేయలేదు. మతంమీద ఆధారపడి, పరిపాలనకు పూనుకుంటున్నారు. హిందువులకు మహమ్మదీయులతో సమానమైన హక్కులు వసతులు లేవు.

మన రాజ్యాంగంలో ఇతర లోపాలెన్ని ఉన్నా, మతాధిక్యత మీద ఆధారపడలేదు. అన్నిమతాలకు సమానమైన అవకాశాలున్నయ్. రాజ్యాంగరచన పూర్తై, జనవరి 26 నుంచి అమలులోకి వచ్చింది.

తెలంగాణాలో, బెంగాల్‌లో కమ్యూనిస్టుల దౌర్జన్యం ఇంకా సాగుతూనే ఉంది. కార్మికుల్లోగాని, రైతుల్లోగాని అధికసంఖ్యాకులు కమ్యూనిస్టుఉద్యమాల్లో పాల్గొనట్లేదు.

1942 సంవత్సరంలో ఆగస్టు ఉద్యమంలో 75 బాంబులు ప్రభుత్వం పరిశీలించారు. '48 '49 లో 800 బాంబులు. 10 రెట్లపైన బాంబులు విసిరినా, ఆగస్టుఉద్యమం సాగినట్టు కమ్యూనిస్టు ఉద్యమం సాగట్లేదు. సాగదు. కమ్యూనిస్టుల దౌర్జన్యాన్ని సాంతం నిర్మూలిస్తే, శాంతిభద్రతలు సుస్థిరం కాగలవు.

అధికసంఖ్యాకులు ప్రభుత్వంవైపునే ఉన్నా, కాంగ్రెస్ పార్టీ ఇదివరకటిలా ప్రజల్లో కర్తవ్యచైతన్యం కలిగించలేకపోతోంది. ఇది ప్రభుత్వానికి పెద్ద ప్రతిబంధకంగా ఉంది. ప్రజల్లో తీవ్రమైన చైతన్యం కలగనంతవరకూ, దేశం ముందడుగు వేయజాలదు. కాంగ్రెస్ పతనావస్థలోంచి మళ్లీ నైతికబలంతో పైకి రాగలదా?

అనేకసమస్యల నెదుర్కొంటున్న మన ప్రభుత్వాలు, ప్రజలతో, ఇతరప్రజాస్వామికపార్టీలతో కలసి దేశఅభివృద్ధికి పాటుపడాలి.

 

# వార్తా చిత్రాలు

 



భారత పార్లమెంటు సభ్యులయిన స్త్రీలు. ఆరోగ్యశాఖా మంత్రిణి అమృతకౌర్ మధ్య కూర్చుని ఉన్నారు.



రాష్ట్రపతి బాబూరాజేంద్రప్రసాద్ జనవరి 27-వ తేదీన ఢిల్లీ ప్రభుత్వ భవనంలో జరిగిన విందులో సర్దార్ పటేల్, మౌలానా ఆజాద్, డాక్టర్ సోకర్నోలతో ప్రసంగిస్తున్న దృశ్యం.



భారతదేశపు ప్రథమ న్యాయస్థాన (సుప్రీంకోర్టు) ప్రారంభసమావేశం.

Regd. No. M 4479.

# ఆంధ్రపత్రిక

## శ్రీ 'వికృతి' నామ సంవత్సర

# పంచాంగం

ఈ సంవత్సరం పంచాంగంలో వాక్యప్రకార, దృక్సిద్ధాంతాల ప్రకారం వేర్వేరుగా గుణింపబడిన రెండు పద్ధతుల తిథి నక్షత్రాదులు వేర్వేరుగా చూపబడినవి.

**ఆంధ్రపత్రిక పంచాంగాలు**
**ఆంధ్రుల ఆదరాభిమానాలను చూరగొన్నవి**

బ్రహ్మశ్రీ శ్రీమత్పిడపర్తి కృష్ణమూర్తిశాస్త్రిగారిచే గుణించబడిన

# కొత్త పంచాంగాలు సిద్ధమైనవి

**ప్రతి 1 కి. 0-4-0, 100 కి. 16-0-0,**
**1000 కి. 150-0-0** రైల్వేఖర్చులు ప్రత్యేకం.

వివరాలకు వ్రాయండి

## మేనేజరు, ఆంధ్రపత్రిక మద్రాసు 1.

Edited, Printed & Published by S Sambhu Prasad, at the Andhra Patrika Press 7 Thambu Chetty St, Madras